JAGATI Rs. 2-00 Oct. 1988

33rd Year of Publication




## అక్టోబర్ - 1988



'ఇదేమి రైలు, బాబూ అప్పుడే వెనక్కి వచ్చేస్తోంది'.
—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు
రు 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : మీరా నాయర్ 'సలాం బొంబె' హీరో

# నిమ్మతొనలు

మామగారూ, మీరు స్కూటర్ యిస్తానని చెప్పి ఆరునెలలయింది. ఇదేం బాగాలేదండీ - ఇలాగైతే మీ అమ్మాయిని పుట్టింటికి పంపేయాల్సి వుంటుంది' - అన్నాడు శ్యామ్రావు.

'బెదిరిస్తున్నావా, నాయనా? నేను కొనిస్తానన్నది సైకిలు - స్కూటరు కాదు' - అని బింకంగా సమాధానం చెప్పాడు మామగారు.

—బి జేసుదాసు
కొండపల్లి

పార్వతీ, పగలు ఆఫీసులో పని చేసేటప్పుడు మనసునిండా నీవే ఉంటావు. కలం ముందుకి సాగదు - ఎంతో వర్క్ పెండింగ్‌లో ఉంటుంది'- అని చెప్పుకున్నాడు పార్కులో పార్వతి ఫ్రెండ్ దేవదాసు.

'నేనో ఉపాయం చెప్పనా?' - అడిగింది పార్వతి.

చెప్పమన్నాడు దేవదాసు.

'పెండింగ్ తప్పించేందుకు డిపెండింగ్ తప్పదు. అంచేత, మీ వాళ్ళతో మాట్లాడి ముహూర్తం పెట్టించు' - అని చిటెకలో తేల్చింది పార్వతి.

—కె రామకృష్ణ
రేపల్లె

నాన్నారూ, నాకు చెయ్యి నొప్పిగా ఉంది - వాచీ కొనరా?' - అని తండ్రిని అర్థించాడు తనయుడు.

'చెయ్యి నొప్పిగా ఉంటే, డాక్టరు గారికి చూపించుకో - అంతేగాని వాచీ ఎందుకురా?' - తెలుసుకోగోరాడు తండ్రి ప్రకాశరావు.

'మీరు కంటినొప్పికి కళ్లజోడు వాడటం లేదా? అందుకే!' - తడుముకోకుండా చెప్పాడు తనయుడు శంకర్.

—కె నాగేశ్వరరావు
నర్సారావుపేట

మీ టైలరింగ్‌షాపు బట్టలు కుట్టడంలో ప్రత్యేకత పొందిందట?'- అడిగాడు వామనరావు.

'అవును, సార్' - షాపు యజమాని సోమేశ్వరం హాసవదనంతో చెప్పాడు.

'ఏమిటా ప్రత్యేకత?'

'మీ బట్టలుకుట్టి, మీకు యిచ్చేయడం ప్రత్యేకత కాదా, సార్? క్లాత్ కాజేయకుండా, పోయిందనకుండా యిచ్చేస్తాం.'

—సెల్వి
నందిగామ

నువ్వొక్కడివే యిన్ని
ఎలా చేశావురా - నాకర్థం గాకుండా ఉంది' - అన్నారు లెఖ్ఖల మేష్టారు, గోపీతో
'నేనొక్కడినే కాదండీ - మా నాన్న కూడా నాకు సాయం చేశాడండీ' - అని చెప్పుకున్నాడు గోపీ.

—వై వి రమణ
చీరాల

ఈ ఆడవాళ్లు గోళ్లు ఆ విధంగా ఎందుకు పెంచుకుంటారు? భయపెట్టే ఆ గోళ్లు చాలక, వాటికి రంగులొకటి। పొడుగుగోళ్ల ఆడపిల్లని నేను భస్తే పెళ్లిచేసుకోను - అని తన సువర్ణాభిప్రాయం వెలిబుచ్చాడు కేశవరావు, మిత్రుడు నారాయణ మూర్తితో.
'పెళ్లి చూపులప్పుడు ఎంతో బుద్దిమంతురాలిలా కనిపించి, పెళ్లయ్యాక గోళ్లు పెంచుకుంటే ఏం చేస్తావోయ్ - విడాకులిస్తావా? అసలీ గోళ్లు ఎందుకు పెంచుకుంటారో తెలుసా?' - అని అడిగాడు నారాయణ మూర్తి, ఆ విషయమై తను ఎంతో పరిశోధన చేసినట్టు!
తెలియదన్నాడు కేశవరావు బిక్క మొహం పెట్టి.
'చెప్పిన మాట వినని భర్తని రక్కేందుకు!'

—కె శేఖర్‌బాబు
మైలవరం

డాక్టర్, మీరు చెప్పినట్లుగానే రోజూ ఉదయం రెండు పెగులు తీసుకుంటున్నాను. అయినా నీరసం తగ్గలేదు - అన్నాడు శంకర్, డాక్టరుతో
'నేను తీసుకోమన్నది పెగు కాదయ్యా, బాబూ, ఎగ్గు....' మొత్తుకున్నాడు డాక్టరు.

—వి కాత్యాయని
కాకినాడ - 3

# పాఠకుల తీర్పు

చందూర్ గారికి : నమస్కారములు ....మొదటి పేజీ నుంచి చివరి పేజీ దాకా, పరిసరాలను మరిపించి చది వింపజేసే పత్రిక 'జగతి'....'సంసార మునకు వీపులు తిప్పిన వారే యోగులు' అని గోపాల రెడ్డి గారు ఎంతో గొప్పగా చెప్పారు.

—వై సుధాకర బాబు
మోపిదేవి

ప్రియమయిన చందూర్ దంపతు లకు : నమస్తే....మీ అనుభవాల్లో, ఆనందాల్లో, అనుభూతుల్లో మేమూ భాగం పంచుకుంటూనే వున్నాం - మీరెక్కడికి వెళ్లినా మీ వెంట మేమూ తిరుగుతున్న అనుభూతిని పొందు తున్నాం....మాలతిగారికి జరిగిన నిరా డంబరమైన సన్మానం చదివి పుల కించాం. ఆర్భాటం, కీర్తి కాంక్ష లేకుండా, ఆ సన్మానం చేసిన వారు అభినందనీయులు. అంత హుందాగా సన్మానాన్ని అందుకున్న మాలతిగారు ధన్యులు. దీన్ని ఆదర్శంగా ఎంత మంది తీసుకోగలరో వారు బుద్ధి మంతులు. శుభాకాంక్షలతో....

— శర్వాణి
హుబ్లి - 20

చందూర్ గారికి : మౌలానా అజాద్ గురించి వ్రాసినది, ఆ ముఖచిత్రమూ 'జగతి' - జూలై 1988) రెండూ బావున్నాయి. 'వీపు' విషయం చెబుతూ బెజవాడ గోపాలరెడ్డిగారు 'నీ కాగ డాను నెత్తురు చమురుతో వెలిగించుకో; నీ దేహాన్ని నీ ప్రాణాన్ని దీపపు వత్తిగా పేనుకో, నెమ్మదిగా నీ వీపును చూస్తూ, ప్రజలే అనుసరించి వస్తారు - అని ఎంతో చక్కగా చెప్పారు. 'ప్రతి గురువారం' సీరియల్ ఆదర్శ వంతంగా, ఆసక్తిజనకంగా ఉంది.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

చందూర్‌గారికి హృదయపూర్వక నమస్కృతులు. మీ ఆధ్వర్యాన వెలు వడుతూన్న 'జగతి' మాస పత్రికను ఇటీవల చూడటం తటస్థించింది. ఇంత చక్కటి పత్రిక మీరు నడుపుతున్నారని యింతదాకా నాకు తెలియదు. నేటి పత్రికలకు, పూర్తిగా భిన్నమైనది 'జగతి' అతి సుందరంగా తీర్చి దిద్ద టమేగాక, కొన్ని శీర్షికలనైతే పాఠ కులు మళ్లీ మళ్లీ చదివేపత్రికగా రూపొం దించారు. ఇంత మంచి పత్రిక గురించి యిన్నాళ్లూ తెలుసుకో లేకపోయి నందుకు విచారిస్తున్నాను. 'నిమ్మ తొనలు' నుండి 'డైరీ' వరకు ప్రతి శీర్షిక వైశిష్ట్యాన్ని పెంచేదే!

—కమల్ హాసన్
తెనాలి - 1

# ప్రాచీన సాహితి

నిగమ సుభాషితా భ్యసన నిష్ఠలు గల్గిన యట్టి పండితుల్
మగువల పొందు నింద్యమని మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్
జగమున నెవ్వడోపు విల సత్కురువింద మణిప్రభా ధగ
ద్ధగిత కలాప రమ్యవనితా జఘనంబు బరిత్యజింపగాన్

-భర్తృహరి

చెప్పంగ జూచు, జూచి, ముఖాంబుజము దెస
దప్పక చూచును, జెప్ప నోరు
పోక నిల్చు, నుపాయములు మతించు, మతించి,
నేర్పుదేలేక నిట్టూర్పువుచ్చు.
సుందరామిని జెప్ప నూహించు, నూహించి
పురమునకని యర్ధమునవె నిల్చు,
ననసూయ జూచు, బ్రియంవద జూచు, నా
మేనకాత్మజ జూచు, మీదు జూచు,
దరుణి దెస మోహలత యీడ్వ బురము దెసకు
కార్యలత యీడ్వ రెండు వంకలకు జనుచు,
భావ్యమిది యని కార్య మేర్పఱుప లేక
నుల్ల ముయ్యాల లూగె భూవల్లభునకు

పిల్లలమఱ్ఱి 'శాకుంతలమ్'

కోతుల నేలి నాడవని కోవిదు లెన్నగ వింటి నేనయో
కోతిగ నుంటి నన్నిటుల గొబ్బున సేవకుగా నొనర్చి సం
ప్రీతిగ బ్రోవు మంటి నిఱుపేదల బ్రోదిగ సాకు టెల్ల బ్ర
ఖ్యాతియ కాదె యంచు మనసా హరిపాదము లాశ్రయింపుమా

—మానస బోధ శతకం

# పాతికేళ్ళనాటి పిక్చర్

## సోవియట్ చిత్రం 'ఉజ్వల సంవత్సరాలు'

అంతర్జాతీయ ఫిలిమ్ ప్రదర్శనోత్సవాలలో - 1961లో జరిగిన 14వ కానిస్ ఫెస్టివల్‌లో - 'ఉజ్వల సంవత్సరాలు' అనే సోవియట్ చిత్రం ఉత్తమమైనదిగా పేర్కొనబడిందంటే, అది ఆకస్మికంగా జరిగినది కాదు. ఆ చిత్రం వెనక ఒక అసాధారణమైన కథ ఉంది. 18 సంవత్సరాల క్రితం, ఈ చిత్రానికి స్క్రిప్ట్ రాసిన 'అలెగ్జాండర్ డోన్‌జెంకొవె' ఒక ప్రముఖ నిర్మాత. అయితే, తను తయారు చేసిన చిత్ర కథను తెరకెక్కించే అవకాశం ఆయనకు లేకపోయింది. ఈ చిత్ర నిర్మాణం తలపెట్టడానికి ఆరేళ్ల క్రితమే 'ఆయన మరణించారు. వ్యక్తికైతే మరణంగాని కళాకారుని సృజనాత్మక కృషికి మరణం లేదు. 'డోన్ జెంకొవె' చనిపోయిన ఒకటిన్నర సంవత్సరాలకు, ఆయన రూపొందించిన 'సాగర గీతం' పిక్చర్ విడుదల అయింది - ఆయన భార్య జూలియా ఆ చిత్రాన్ని పూర్తి చేసింది. 'సాగర గీతం' విడుదలైన రెండేళ్లకు జూలియాయే 'ఉజ్వల సంవత్సరాలు' స్క్రిప్ట్ వెలికితీసి, నిర్మాణం ప్రారంభించింది. ఆ చిత్రం మరుపురాని ఒక దృశ్యకావ్యంగా ప్రేక్షకుల నాకట్టుకుంది. రెండవ ప్రపంచ యుద్ధ కాలాన్ని గుర్తుచేసే ఈ పిక్చర్ లోని వివిధ పాత్రలు ప్రాణాపాయ పరిస్థితులకు, ఘోర ప్రమాదాలకు, భయంకరం దారిద్ర్యానికి గురి అవుతాయి. నరరూప రాక్షసుల వికర నృత్యం ఒకవైపు, ఆకలిమంటల హాహాకారం మరొకవైపు. నిర్దాక్షిణ్యానికీ రక్తపాతానికీ లోనైనప్పటికీ, ఈ 'యుద్ధచిత్రం' శాంతిని కాంక్షించే మానవాత్మలోని దయా గుణాన్నీ సౌందర్య దీప్తినీ విశ్వమానవ శ్రేయాన్ని ఉద్విగ్నతతో కీర్తిస్తుంది. సామాన్య యుద్ధ చిత్రాలవంటిది కాదిది. ఆత్మపరిశీలనగా, మనోగతంలా స్వగతంలా చిన్న చిన్న సంఘటనలూ సన్నివేశాలూ ద్వారా యుద్ధరాక్షసికి గల భయంకరాకృతిని మనకి వెల్లడిస్తుంది. ఆనాటి సోవియట్ ప్రజాజీవితానికి అద్దం వంటిది ఈ చిత్రం.

—'జగతి' - అక్టోబరు 1963

---

విజ్ఞాన మనే ద్వీపం పెరిగిన కొద్దీ, ఆశ్చర్యమను తీరరేఖ కూడా దానితో సహజంగా పెరుగుతుంది.

—రాల్ఫ్ సాక్మాన్

# వెన్నెల కెరటాలు

## 'కథాంజలి'

త్రిమూర్తుల ఆశీర్వాద బలంతో బయలుదేరి నేను సరాసరి శ్రీ డి. దేశికావారి వద్దకు వెళ్ళాను. అయుర్వేదాశ్రమానికి వారు అధిపతి. నేను పత్రికను పెట్టబోతున్నట్టు వారికి చెప్పాను. వాత్సల్యంతో వారు తొమ్మిది రూపాయలకు ఒక చెక్‌ను, ఒక అడ్వర్‌టైజ్‌మెంటు బ్లాక్‌ను నాకు యిచ్చి 'నా సహాయం నీకు ఎప్పుడూ వుంటుంది' అంటూ అభయహస్త మిచ్చారు. ఎక్కడికి పోయినా యిలాంటి ఆదరాభిమానాలు లభించడంతో నాకు ఏనుగ బలం వచ్చింది. ఆ ఊపుతోనే నేను కేసరీ కుటీరంకు సంబంధించిన డాక్టరు శేషగిరిరావు వద్దకు వెళ్ళాను. వారు నా ఆశయం పట్ల సానుభూతిని వెల్లడించి ఎనిమిది రూపాయలు, ఒక అడ్వర్‌టైజ్‌మెంట్ బ్లాకు యిచ్చారు. అక్కడినుంచి శ్రీ గూడవల్లి రామబ్రహ్మం వద్దకు వెళ్ళాను. అప్పుడు వారు 'బాలయోగిని' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. తమ చిత్రం తాలూకు అడ్వర్‌టైజ్‌మెంటు బ్లాకును పది రూపాయల కొక చెక్‌ను యిచ్చి, వారు నా ఉత్సాహాన్ని అతిశయింప జేశారు.

—రాఘవాచారి
స్వర్ణోత్సవ సంచికలో

## మొదటి జ్ఞాపకం

అది 1945 సంవత్సరం. కీర్తిశేషులు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గారు మద్రాసు ప్రభుత్వం చేత ప్రభుత్వ ఆస్థాన కవిగా నియమింప బడ్డారు. ఆ సందర్భంలో విజయవాడలో పెద్దఎత్తున అభినందన సభ జరిగింది. శ్రీ కాటూరి వేంకటేశ్వర రావుగారు దానికి సారథులు. అదే సందర్భంలో పాండవోద్యోగ నాటక పోటీలు జరిగినవి. పోటీలు గుంటూరులో జరిగినవి. ఆ పోటీల కార్యక్రమాన్ని నడిపించే బాధ్యత నాకు అప్పగించ బడింది. ఆ పోటీలలో శ్రీ పీసపాటి నరసింహమూర్తి గారు ఉత్తమ కృష్ణ పాత్ర ధారిగా నిర్ణయించబడ్డారు. అదే సందర్భంలో ధూళిపాళ వారికి కూడా ఉత్తమ పాత్రధారిగా మన్నన లభించింది. అభినందన సభల సందర్భంలో గూడా విజయవాడ గాంధి హైస్కూలు

భవనంలో పాండవోద్యోగ నాటక ప్రదర్శన జరిగింది. వేలకొలది ప్రేక్షకులు ఆ నాటకాన్ని తిలకించి ఆనందించారు. అభినందన సభకు శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు అధ్యక్షత వహించారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, వేలూరి శివరామ శాస్త్రిగారి వంటి ఉద్దండ పండితులు శ్రీ వేంకట శాస్త్రిగారిని పల్లకీలో కూర్చోబెట్టి తాము ఆ పల్లకిని మోసుకుంటూ సభాస్థలికి తీసుకొని వచ్చారు. అది ఒక మధురస్మృతి. తెలుగు సాహిత్య చరిత్రలో ఒక మరపురాని ఘట్టం. మొదటిసారి దాశరథిని అదే సందర్భంలో నేను చూచాను..... అభినందన సభ సందర్భంలో దాశరథి చదివిన పూజా పంచకంలో నుండి ఒక్క పద్యాన్ని ఉదహరిస్తాను. కవిత తెలుగు ప్రజకు కడు దగ్గరవుటకు - మీరు చేసి నట్టి భూరి కృషికి - యావ దాంధ్రజాతి అంజలి ఘటియించె - వెళ్ళ పిల్ల మాట చెల్లదెచట.

— వేమూరి ఆంజనేయశర్మ
'స్రవంతి' లో

## కోహినూరు

కోహినూరు సుమారు 1000 సంవత్సరాల పాతది. ఇది 1309 వరకు మాళ్వరాజు వద్ద ఉండేది. దీనిని అల్లాఉద్దీన్ ఖిల్జీ తమ వశం చేసుకున్నారు. పర్షియన్ రాజైన నాదిర్షా లాహోర్, ఢిల్లీ దండెత్తినప్పుడు మొట్ట మొదటగా దోచుకున్నది అతి పెద్దదైన కోహినూర్ వజ్రం. దీని బరువు 186 కారెట్లు. 'కోహినూర్' అంటే పర్షియన్ భాషలో 'కాంతి కొండ'. దీనిని బ్రిటిష్ వారు చివరగా తమ వశం చేసుకొని బ్రిటిష్ మకుటంలో పెట్టుకున్నారు. 173( వరకు భారతదేశంలోని గను( ప్రపంచానికి వజ్రాలు సరఫరా చేస్తు వచ్చాయి. శతాబ్దాలుగా సూరత్‌లోన గుజరాత్‌లోని పలాన్‌పూర్‌లోను హ( కారులు వజ్రాలను మెరుగుపెట్టడంలో సామర్థ్యాన్ని కల్గి ఉన్నారు. ఇప్పటి( కూడా వారు వంశ పారంపర్యంగా వచ్చే పద్ధతినే వాడతారు. భారత దేశం ఇప్పటికీ వజ్రాలను కోయడం నగిషీ పెట్టడంలో ఒక ప్రముఖ పాత్రను వహిస్తోంది..... మహ్మద్ గజనీ ఆస్థాన చరిత్రకారుడు ఉట్‌బీ( మధురాలోని దేవాలయం లో( మూర్తులు పూర్తిగా బంగారంతో( తయారుచేశారని, అవి ఐదు అడుగుల ఎత్తులో ఉండేవని అందులో ఒక( దానిలో 50వేల దీనార్ల జాతి రత్నం( అమర్చబడి ఉందని, మరో దానిలో 400 మిస్కల్స్ ఖరీదైన పచ్చరాయిని పొదిగారని, వేరొక దానిలో పాదాల దగ్గర మాత్రమే 4 లక్షల మిస్కల్స్ ఖరీదుచేసే బంగారం ఉందని వ్రాశారు.

—ఉషా జాన్
'సైనిక సమాచార్'లో





## కోస్ట్‌గార్డ్

ఇండియన్ ఎయిర్‌లైన్స్ నుండి అద్దెకు తెచ్చిన రెండు ఫోక్కర్ ఫ్రెండ్‌షిప్ (యఫ్-27) విమానాలతో మొట్టమొదటి కోస్ట్‌గార్డ్ సముద్ర నిఘా (రికనియెసెన్స్) స్క్వాడ్రన్‌ను 1983 జూలై 30న కలకత్తాలో ప్రారంభించారు. అతి త్వరలోనే యఫ్-27 పైలట్లను మార్పు చేసారు. ప్రారంభమయిననాటి నుండి ఈ స్క్వాడ్రన్ వివిధ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించి ఇప్పటి వరకు 4000 గంటల కాలం ప్రయాణించింది. యఫ్-27 విమానాలు మొట్టమొదటి వైనప్పటికి ఇవి ప్రత్యేకమైన గ్రహణ యంత్రాలను లేకుండా సముద్ర పరిశీలనకు కంటి దృష్టి మీదనే ఆధారపడి పనిచేశాయి. కాని 360 డిగ్రీ సముద్ర నిఘా రాడార్, ఓమేగా నావిగేషన్ సిస్టమ్, ఇన్‌ఫ్రారెడ్ లైన్ స్కాన్స్, ఏరియల్ ఫొటోగ్రఫిక్ ఎక్విప్మెంట్ ఇతర సెర్చ్-రెస్క్యు పరికరాలను కలిగిఉన్న డోర్నాయర్ విమానాలను కోస్ట్‌గార్డ్‌లో ప్రవేశపెట్టడం ద్వారా కోస్ట్‌గార్డ్ తన ప్రత్యేక బాధ్యతలను నిర్వహించడంలో కొత్త పంథా సంతరించుకొన్నది. 1986మే 4న ఆర్గురు పైలట్లు, ముగ్గురు నావిగేటర్లు, తొమ్మిండుగురు టెక్నికల్ సిబ్బందిని డోర్నియర్ కంపెనీలో శిక్షణ నిమిత్తం జర్మనీకి పంపించడంతో డోర్నియర్ విమానాలను కోస్ట్‌గార్డ్ ప్రవేశపెట్టే కార్యక్రమం మొదలయ్యింది. వైమానిక సిబ్బందిని కొత్త విమానాలకు మార్పిడి చేయగా ఇంజనీర్లకు అత్యంత ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాలను నిర్వహించడంలో శిక్షణ ఇచ్చారు. మొదటి రెండు సముద్ర నిఘా డోర్నియర్-228 విమానాలను జర్మనీలోని మ్యూనిచ్ వద్ద 1986 జూలై7న లాంచనప్రాయంగా మనకు అందించారు. అరేబియా సముద్రం, పాక్ బే బెంగాల్ సముద్రం, అండమాన్ నికోబార్ సముద్ర ప్రాంతాలలో కోస్ట్‌గార్డ్ తమనౌకా వైమానిక బలంతోగస్తీ తిరుగుతూ నిఘా కార్యక్రమాలను నిర్వహిస్తుంది. భారత సముద్ర ప్రాంతాలలో అక్రమంగా ప్రవేశించిన 42 విదేశీషిప్పింగ్‌డాలర్లనుపట్టుకొన్నారు. కోస్ట్‌గార్డు ప్రధానకార్యాలయం ప్రస్తు

తం న్యూఢిల్లీలో ఉంది. బొంబాయి, మద్రాసు, పోర్ట్‌బ్లయిర్‌లలో ప్రాంతీయ కార్యాలయాలు ఉన్నాయి. ఎనిమిది సముద్రతీరరాష్ట్రాల ప్రధాన భూభాగం లోను, అండమాన్ నికోబార్ దీవుల లోను కోస్ట్‌గార్డ్ కేంద్రాలను ఏర్పాటు చేయాలన్న దీర్ఘకాల పథకం ప్రకారం వాడినార్, పోర్‌బందర్, డమన్, గోవా. కొచ్చిన్, మండపం, హాలియా, కాంప్ బెల్ బేలలో కోస్ట్‌గార్డ్ జిల్లా కార్యాలయ కేంద్రాలు ఏర్పాటు చేయబడాయి. విశాఖ పట్టణము, అండమాన్ నికోబార్ ద్వీపాలలోని డిగ్లపూర్‌లలో త్వరలో జిల్లా కార్యాలయ కేంద్రాలను ఏర్పాటు చేస్తారు. కోస్ట్‌గార్డ్ అత్యంత వైవిధ్యం గల వివిధ బాధ్యతలను నిర్వహిస్తున్నది. అందువలన వివిధ రకాల కార్యక్రమాలను నిర్వహించడానికి అనువుగా కోస్ట్‌గార్డ్ సిబ్బందికి తదనుగుణంగా శిక్షణ ఇచ్చి సామర్థ్యాన్ని, నైపుణ్యాన్ని పెంపొందింబారు.

## గాంధీ స్మారక కేంద్రం

అమెరికా రాజధానీ నగరమైన వాషింగ్టన్‌లో మహాత్మగాంధి స్మారక చిహ్నం ఏర్పాటుకు అమెరికన్ కాంగ్రెస్ 1948లో అనుమతి నిచ్చింది. భారతీయ సంతతివారు దానికి తగిన నిధులు సమకూర్చుకోలేక పోవడంతో ఆ అనుమతికి ఆ తర్వాత, కాలం చెల్లిపోయింది. కాగా వాషింగ్టన్‌లో గాంధి స్మారక చిహ్నం ఏర్పాటుకు ఇప్పుడు మరొ కసాఅమెరికాలో పెద్దఎత్తున ప్రయత్నం మొదలైంది. 'ఎందరో యుద్ధ నాయకులకు స్మారక మందిరాలను కలిగివున్న అమెరికా రాజధానిలో ఒక శాంతిదూతకు కూడా స్మారక చిహ్నం నిర్మించవలసి వుంది' అని 75మంది అమెరికన్ కాంగ్రెస్‌మెన్ ఇటీవల పంపిన వర్తమానంలో పేర్కొన్నారు. వాషింగ్టన్ డి.సి. లోని ప్రభుత్వ భూమిలో 'గాంధి మెమోరియల్' నిర్మాణానికి తిరిగి అనుమతించే చట్టం చేయాలని పలువురు విజ్ఞప్తి చేశారు. మహాత్మగాంధికి, ఆయన సిద్ధాంతాలకు సారకచిహ్నంగా వుండే ఒక మెమోరియల్ ఏర్పాటువల్ల అమెరికా రాజధానిని ఏటా సందర్శించే లక్షలాదిమంది బాలబాలికలకు ఎంతో ప్రేరణ కలుగుతుందని గాంధి మెమోరియల్ కోసం నూతన చట్టాన్ని ప్రతిపాదిస్తున్న డెమొక్రాటిక్ పార్టీకి చెందిన కాంగ్రెస్ సభ్యుడు మెర్విన్ ఎం. డిమల్లీ అన్నారు. 'ప్రపంచంలోని అనేక ప్రాంతాలలో జాతికలహాలు కఠినమై, వివిధ దేశాలు ఆయుధాల పైన పెద్దమొత్తాలను ఖర్చు చేస్తున్న కాలంలో గాంధి సందేశాన్ని, చైతన్యాన్ని పదిలపరచుకొనవలసి వుంది' అని ఆయన పేర్కొన్నారు. కాంగ్రెస్ సభ్యుడు డిమల్లీ ప్రతిపాదిస్తున్న చట్టం ప్రకారం అమెరికా ప్రభుత్వానికి ఎట్టి ఖర్చు లేకుండా వాషింగ్టన్ నగరంలో గాంధి స్మారక కేంద్ర నిర్మాణం పూర్తవుతుంది. అమెరికాలోని రాజకీయ విద్యకు సంబంధించిన భారత - అమెరికన్ ఫోరం వారు ఈ మెమోరి

యల్ నమూనా రూపకల్పన, నిర్మాణం బాధ్యతలను స్వీకరించారు.

## ఆస్థాన కవి

వచ్చే సెప్టెంబరులో హొవర్డ్ నెమెరోవ్ అమెరికా ఆస్థాన కవిగా పదవీ స్వీకారం చేయనున్నారు. గత మూడేళ్లలో అమెరికా ఆస్థానకవిగా నియమితులైన వారిలో మూడవ వ్యక్తి నెమెరోవ్. మొట్టమొదటి ఆస్థానకవి రాబర్ట్ పెన్ వారెన్ ; రెండవ ఆస్థాన కవి రిచర్డ్ విల్బర్; సెప్టెంబరులో విల్బర్ పదవీ విరమణ చేసిన తర్వాత ఆయన స్థానంలో నెమెరోవ్ పదవీ బాధ్యతలు స్వీకరిస్తారు. అమెరికా ఆస్థాన కవిగా నెమెరోవ్, లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌కు సాహిత్య కార్యక్రమాల విషయంలో సలహా లిస్తారు. లైబ్రరీ 'అర్కయివ్స్' లో పదిలపరచేందుకు కొత్తగా మరికొందరు రచయితల కవితలను, ఇతర సాహిత్యాంశాలను సిఫారసు చేస్తారు. తన ఏడాది పదవీ కాలంలో ఆయన ఒక బహిరంగ కవితాగానాన్ని, మరో బహిరంగ ఉపన్యాసాన్ని కూడా చేస్తారు. 68 ఏళ్ల నెమెరోవ్ ప్రసిద్ధ కవి మాత్రమే కాదు, ఆయన నవలాకారుడు, వ్యాసకర్త, విమర్శకుడు కూడా. సెయింట్ లూయీ లోని వాషింగ్టన్ యూనివర్శిటీలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా ఆయన 20 ఏళ్లపాటు విశిష్టమైన సేవల నందజేశారు. ప్రస్తుతం ఆయన 'లాంగ్వేజ్ అండ్ లిటరేచర్' అనే ఒక సెమినార్ లోను, పద్యరచనా సంబంధితమైన ఒక గ్రాడ్యుయేట్ కోర్సులోను బోధన జరుపుతున్నారు. ఆస్థాన కవిగా వుండే సమయంలో కూడా ఆయన బోధనను కొనసాగిస్తారు. ఆస్థానకవి పదవిలో ఏడాదిపాటు కొనసాగినందుకుగాను నెమెరోవ్‌కి 35 వేల డాలర్ల మొత్తం లభిస్తుంది.

## విజయ గాథ

ప్రకాశం జిల్లా ఓలేటివారిపాలెం గ్రామానికి చెందిన గుత్తా లక్ష్మీనారాయణ కుటుంబం ఒకప్పుడు బాగా ఉన్న కుటుంబమే. అయితే దీర్ఘకాల వర్షాభావ పరిస్థితులవల్ల పరిస్థితి విషమించి వారికి కొంచం కొంచంగా, నమ్ముకున్న నేలనే అమ్ముకోవలసి వచ్చింది. చివరకు 5 ఎకరాల మెట్ట భూమి మిగిలింది. దాన్లో కూడా వేసిన జొన్న పంట గోరుచుట్టుపై రోకటి పోటు అన్నట్టుగా గింజదశలోనే రాలిపోయింది. దీనికి పులిమీద పుట్రలాగా కుక్కకరచినందుకు తీసుకున్న యాంటీరాబీస్ ఇంజక్షను వికటించడంవల్ల లక్ష్మీనారాయణకు రెండు కాళ్లు చచ్చుపడిపోయాయి. తన జీవితం అంతటితో అఖరనుకున్నాడు. కానీ అతని పరిస్థితి గాంచిన విలేజి డెవలప్‌మెంట్ ఆఫీసర్ ఒక చిల్లర దుకాణాన్ని ప్రారంభించడానికి కావలసిన ఆర్థిక సహాయంకోసం ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకోమని సలహా ఇచ్చాడు.

తత్ఫలితంగా పెట్టుకున్న దరఖాస్తును 'కొండపి' బి.డి.ఓ. పరిశీలించి రూ. 10,000/- లు మంజూరు చేశాడు. ఈ మొత్తాన్ని స్థానిక భారతీయ స్టేట్ బ్యాంకువారు రూ. 3000/-లు రాయితీ, రూ. 2000/-లు మార్జిన్ మొత్తాలతో కలిపి మొత్తం రూ. 10,000/- లకు సెప్టెంబరు 1985 తర్వాత మూడు విడతలుగా జారీచేశారు. ఈ మొత్తంలో లక్ష్మీనారాయణ తన గ్రామంలో పచారీ దుకాణాన్ని తెరిచి క్రమంగా దాన్ని అభివృద్ధి చేసి ఫ్యాన్సీ వస్తువులను కూడా అమర్చాడు.....................

....1985 మే నెలలో ఆ గ్రామం మండల ప్రధాన కేంద్రంగా అవతరించింది. దానితో బయటి వ్యక్తులు కూడా ఉద్యోగ రీత్యా ఈ గ్రామానికి వచ్చి స్థిరపడటం ప్రారంభించారు. అదను చూసి లక్ష్మీనారాయణ తన దుకాణంలో అదనంగా స్టేషనరీ, శీతల పానీయాలను కూడా చేర్చాడు. అతని రోజు వారీ అమ్మకాలు రూ. 250/- నుండి రూ. 300/- ల వరకు చేరుకున్నాయి. దీనివలన లక్ష్మీనారాయణ బ్యాంకు రుణాన్ని సకాలంలో తీర్చివేయగలిగాడు. అంతేకాక తన ఆదాయంతో తన మెట్టభూమిలో ఒక బావిని త్రవ్వించి 3 ఎకరాల్లో వేరుశనగలు, మిగిలిన 2 ఎకరాల్లో యూకలిప్టస్ వేశాడు. ప్రస్తుతం పంట చేతికి బాగానే అందుతున్నది. పైగా ప్రభుత్వంవారి వికలాంగ భృతికూడా అందుతున్నది.

# కొత్త పుస్తకాలు

'నా రాట్నచక్రం' - (అనుభవాలూ, జ్ఞాపకాలూ). రచన : తల్లాప్రగడ ప్రకాశరాయడు. ప్రచురణ : గాంధేయ సమాజ సేవా సంస్థ, గాంధీ క్షేత్రం, అవనిగడ్డ - 521123 కృష్ణాజిల్లా. వెల రు : 20 - 00.

"గాంధీ మార్గానుగామి, కర్మవీరుడు, విద్యా వివేక సంపన్నత్వంతో బాటు ఆశ్రమ జీవనం, అధ్యాపక ప్రవృత్తి అభిమానంతో ఆశ్రయించిన ధన్యజీవి" - అని తల్లాప్రగడ ప్రకాశరాయని పరిచయం చేస్తూ అంటున్నారు మండలి బుద్ధ ప్రసాద్. గాంధీ మార్గం త్రికరణ శుద్ధిగా నమ్మి, రాట్నచక్రం ఎలా ఆత్మానంద దాయకం కాగలదో స్వీయానుభవంతో తెలుసుకు, ఎటువంటి పదవులూ ప్రత్యేకతలూ ఆశించక గీతాకారుడు చెప్పినట్టు, 'కర్మణ్యే వాధికారస్తే, మా ఫలేషు కదాచన' గా పరిపూర్ణ జీవితం గడిపిన పుణ్యమూర్తి ఆయన.

296 పేజీల ఈ పుస్తకంలో సగభాగం, రావులపర్రు, ఉంగుటూరు, పూళ్ల, ఆ తర్వాత రాజమండ్రి హితకారిణీ హైస్కూలు, అప్పట్లో ఎఫె ఎ దాకా మాత్రమే వున్న కాకినాడ కాలేజీ (పిఠాపురం రాజాది) చదువు, మళ్లీ రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీలో బి. ఎ. కలకత్తాలో ఎమ్. ఎ. - యింతు మించు గాంధీ ఉద్యమంలో పడేటంత వరకూ గడిచినకాలం. ఉంగుటూరులోని ఎడ్వర్డ్ లోయర్ సెకండరీ స్కూలు, తణుకులోని విక్టోరియా మెమోరియల్ స్కూలు - ఆ పేర్లే ఆ నాటి విద్యా పద్ధతులకు సంకేతాలు. తండ్రి తన ఏడోఏట చనిపోగా, మేనమామ ఆదూరి శేషయ్య, ప్రకాశరాయనీ, ఆయన చెల్లెళ్లిద్దరినీ పెంచి పెద్ద జేశారు. చెల్లెళ్లిద్దరిలో ఒకామె పధ్నాలుగో ఏట, మరొకామె ఇరవై ఒకటో ఏటా చనిపోతారు. ఆ తోబుట్టువుల మరణం, ప్రకాశరాయనిపై చెరగని ముద్ర వేసినట్టు ఆ జ్ఞాపకాలు చెబుతున్నాయి. కాకినాడలో రఘుపతి వెంకటరత్నం నాయుడు, రాజమండ్రిలో కూల్ డ్రే, వీరేశలింగం, కలకత్తాలో రామకృష్ణా మిషన్, ఆర్య సమాజ్, నేషనల్ కాంగ్రెస్ - యిలా ఆయా ప్రభావాలు ఈయనలో కనిపిస్తాయి. చివరికన్నీ గాంధేయ వాహినిలో కలుస్తాయి.

సీతానగరంలో గాంధీగారు ఒక రోజున బసచేశారు. అప్పట్లో ప్రకాశరాయడు సీతానగరం ఆశ్రమంలో ఉన్నారు. ఈయన గాంధీగారిని చూశారు. నమస్కరించారే తప్ప

కలుసుకోలేదు మాట్లాడలేదు. కాని, ఆ గాంధేయ తత్త్వం, ఆ సిద్ధాంతం, ఆయనకు తృప్తిని శాంతిని యిచ్చాయి.

ఈ గాంధీ శిష్యునికి చలంగారు బాగా తెలుసు. ఇరువురూ కాకినాడలో యించుమించు ఒక సమయంలో బ్రహ్మ సమాజ ప్రార్థనలలో పడ్డారు. ఆయన సాహిత్య సీమలోకి, ఈయన గాంధీ పథంలోకి మళ్లారు. చలంగారు కొద్ది నెలలలో పోతారనగా ప్రకాశరాయడు ఆయనని చూడటానికి తిరువన్నామలై వెళ్లారు. వారిద్దరూ అప్పట్లో తీయించు కున్న ఫొటో, చిన్ననాటి ఫొటో (కాకి నాడ) రెండూ ఉన్నాయి ఈ పుస్త కంలో.

వర్డ్స్‌వర్త్‌నీ (డా ఫొ డి ల్స్) రస్కిన్‌నీ అభిమానించిన ప్రకాశ రాయడు, గాంధీజీ నిర్దేశించిన నిర్మాణ కార్యక్రమానికి అంకితులయారు. గాంధీజీ చూపిన వెలుగు చూడలేని గుడ్లగూబ నేటిప్రపంచం. అహింసా యోధునిగా, కర్మవీరునిగా, నిర్మాణ కార్యకర్తగా, సిద్ధాంత న్యాయం వెంట నడిచిన ధీరుడు తల్లాప్రగడ ప్రకాశ రాయడు.

—క్షీరసాగరమ్

అలోకన - వార్షిక వాఙ్మయసూచి 1985. సంపాదకులు : జివి సుబ్ర హ్మణ్యం. ప్రచురణ : తెలుగు సాహితి, హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 134. వెల : రు 100 - 00.

"దక్షిణ భారతాన తొలిసారి వెల సిన కేంద్ర విశ్వవిద్యాలయం హైదరా బాదు విశ్వవిద్యాలయం.... ఇంత వరకు తెలుగులో 'అలోకన' వంటి వార్షిక వాఙ్మయసూచి వెలువడలేదు.... తెలుగులో ప్రచురింపబడిన వాఙ్మ యాన్ని గురించిన సామగ్రినంతా సూచికారూపంలో సంపుటీకరింప బడటం అలోకన విశేషం.... ఇది ఒక నమూనాగా సహృదయ లోకానికి సమర్పిస్తున్నాం" - అంటున్నారు సంపాదకులు.

'1985 - అలోకన' కార్యకర్తల లోని అధ్యాపకులు : జివి సుబ్ర హ్మణ్యం, కెకె రంగాచార్యులు, సి. అనందారామం, అర్ శ్రీహరి, పి రామ నరసింహం, యన్నెస్ రాజు, యమ్ లావణ్య సరస్వతి. (అందరూ డాక్టరేట్‌లే). వీరు గాక పదిమంది పిహెచ్‌డి విద్యార్థినీ విద్యార్థులు, పదకొండుగురు యమ్ ఫి ల్ వారు, పదహారుగురు ఎమ్ఎ వారూ ముగురు కార్యాలయ సిబ్బంది ఈ 'అలోకన' కూర్పుకి తోడ్పడ్డారు.

1) గ్రంథాలు, 2) కవితలు, గేయాలు, మినీ కవితలు; 3) కథలు, ధారావాహికాలు; 4)సంపాదకీయాలు; 5) సీరియల్ శీర్షికలు ; 6) వ్యాసాలు ; 7) ముఖాముఖి; 8)ఇంగ్లీషులో వెలు వడిన రచనలు; 9) పరిశిష్టం - ఇలా తొమ్మిది భాగాలుగా, నుడిజాడలు : హొడి గుర్తులు, తీరుగుర్తులుతో రమా రమి 500 పేజీలు ఉంది ఈ రిఫ రెన్స్ బుక్.

అవలోకన, విలోకన అనే మాట లకు చెవులు అలవాటు పడ్డాయి గాని

'ఆలోకన' అనే పదం కొత్తగా ధ్వని స్తుంది అలాగే ఆరోపం, పరిశిష్టం అనేవి నిఘంటువు చూసి అర్థాలు తెలుసుకోవలసిన మాటలు. మెడిసిన్ ఎంట్రన్స్‌కి కూచుంటున్నాడనీ, ఇంజ నీరింగ్ ఎంట్రన్స్‌కి కూచుంటున్నాడనీ అంటాము గాని వైద్య ప్రవేశిక కనీ, ఇంజనీరింగ్ (దీనిని తెలుగులో ఏమం టారో తెలీదు) ప్రవేశిక కనీ అనము.

పుస్తకాలు పబ్లిషర్స్వా, ఆ పుస్తకాలు ఏ ఏ విభాగానికి చెందినవీ - అదంతా బావుంది. కవితలూ, గేయాలూ ఆయా పత్రికలలో పడినవి పేర్కొనడం కొంతవరకూ సబబే! కాని, నాలుగు లైనుల మినీకవిత, కాలమ్ దాటని కార్డు కథ - యివి కూడా లిస్ట్‌లోకి రావాలా? ధారావాహికాలు పట్టిక లోకి చేర్చడం కరెక్టే - కాని, ఎన్ని కథలు లిస్ట్‌లో చేరుస్తారు? అలా చేర్చేందుకు ప్రమాణాలేమిటి? ఆ కథ అచ్చు వేసిన పత్రికని బట్టా? వ్రాసిన రచయితని బట్టా? లేక, అందులోని సారాంశమా? .... ఉత్సాహవంతులైన యువతీ యువకులు ఒక బృహత్ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగిం చారు - అందుకు సందేహం లేదు. అయితే, యిటువంటి మంచి ప్రయ త్నానికి బాలారిష్ట దోషం తగల కూడ దనే ఈ చేస్తున్న సూచనలు. ఇక సంపాదకీయాలు. మన పత్రికా ప్రపం చం గుత్తాధిపత్యానికీ, పరస్పర పోటీకీ, వ్యాపార న్యాయానికీ లోబడి వుంది. నిష్పాక్షిక సంపాదకీయాలు చాలా అరుదు. వాటిలో సమాచార వివరణ తప్ప వాఙ్మయ విలువ ఏముంటుంది? ....వ్యాసాలు, ముఖాముఖి (ఆరు, ఏడు భాగాలు) రెండూ బావున్నాయి... అచ్చయిన ప్రతిదీ పుస్తకంలో చేర్చడం గాక, ఈ పుస్తకంలో 'ఎంట్రీ' పొందేందుకు కూడా కొన్ని అర్హతలు నిర్ణయించాలి. ప్రశంసనీయమగు ఒక గొప్ప ప్రయత్నం ఈ 'ఆలోకన' - సంపాదకులు జివి సుబ్రమణ్యం అభి నందనీయులు.

—క్షీరసాగరమ్

జీవిత రహస్యం - కవితా సంకల నం. రచన: జమ్మి వెంకటరావు ప్రచురణ: తెలుగు సాహితి, E A 124 - 2, టాగోర్ గార్డెన్, న్యూఢిల్లీ- 110 027. వెల: రు 5-00.

'ఆరుకోట్ల మంది - ఆంధ్రులున్నా- అయిదువందల - ప్రతులే - అచ్చు వేసినా - అవి ఐదుగురే చదివినా' - తన కృషి ఫలించినట్టేనంటున్నారు ఈ కవి. జీవనవాహినిలో జీర్ణమయ్యేదే జీవితమనీ, అదే జీవితపు తళుకు అనీ, కంటికి కనపడకుండా కర్చయిపోయేదే జీవితమనీ, మూట మూటగా ఉంచి నప్పుడే అది మధురక్షణాల మూట అవుతుందనీ, ఆశ అనేది అమృతం కంటె తీయగా ఉంటుందనీ, తెలుసు కుందామంటే తేలిపోతుందనీ కలుసు కుందామంటే కరిగిపోతుందనీ చెప్పే జమ్మి వెంకటరావు కవితలో ఆత్మా న్వేషణతో బాటు రెక్కలు కట్టుకు ఎగరాలనే తపన, తత్వచింతన కని పిస్తాయి.

—సుమతి

## ఈ మధ్య అందినవి :

కాగితం సూర్యుడు - కవిత. విజయ శారధి, కవిసేన, ఖర్గపూర్ - 1.... రు. 1-00

భగవద్గీత - (స్వామి ప్రభవానంద - క్రిస్టఫర్ ఇషర్వుడ్‌ల ఆంగ్లాను వాదంలోని నూరు పంక్తులు) - ఫ్రీ డిస్ట్రిబ్యూషన్. ఎమ్ ఆర్ అప్పారావు, నూజివీడు - 521 201.

రవళి - కవితా సంకలనం. మన్నవ విద్యాధరి, తెలుగు సాహితి, న్యూఢిల్లీ - 27... రు 5-00.

హరిజన నాయకుడు - సాంఘిక నవల. ఆచార్యరంగా. కిసాన్ పబ్లికేషన్స్, గుంటూరు -7 .... రు 10-00

ఆచార్య రంగాజీకి కవితా మంజరి. సంపాదకత్వం : దరువూరి వీరయ్య. కిసాన్ పబ్లికేషన్స్, గుంటూరు -7 .... రు 25-00

దీపికలు - కవిత. బెజవాడ గోపాల రెడ్డి. ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు - 1.... రు 8-00

విజ్ఞాన సర్వస్వము - రెండవ సంపుటము- తెలుగు సంస్కృతి - సంపాదక మండలి : బి. రామరాజు, పరబ్రహ్మశాస్త్రి. సంగ్రాహకుడు : శేష గిరిరావు ; నిర్వాహక సంగ్రాహకుడు : ఆంజనేయులు ; ప్రచురణ : విజ్ఞాన సర్వస్వ కేంద్రం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 007 .... వెల రు 100-00

నీ హారిక

యామినీ దుహిత
కుమారీ నీ హారిక
బాల సూర్యప్రసాద్‌తో
ఉదయాన్నే లేచిపోయింది

—బెజవాడ గోపాలరెడ్డి
మే - 1988

సింగరేణి మండుతోంది - నవల. జాతశ్రీ రు. 15-00 ... ప్రేమ్‌చంద్ సాహిత్య వ్యాసాలు - రు 7-00.... భగత్‌సింగ్ - అజయ్‌ఘోష్ సోహన్ సింగ్‌జోష్‌ల మాతృకకు వాసిరెడ్డి భాస్కరరావు, కె రాజేశ్వరరావుల తెలుగు అనువాదం - రు 8-00.... రష్యన్ చిత్రకళ — చలసాని ప్రసాద రావు. రు 7 - 00.... అవయవాల ఆత్మకథలు - డా॥ పరుచూరి రాజారామ్. రు 6-00.... చొప్పదంటు ప్రశ్నలు - డా॥ మహీధర నళినీ మోహన్ రు 12-00.... విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.... విశాలాంధ్ర బుక్ హౌస్ బ్రాంచీలు : విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖ పట్నం, తిరుపతి, హన్మకొండ, గుంటూరు, కాకినాడ.

అందుకున్న పుస్తకాలన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు సంచికలలో వెలువడుతాయి.

టి.సుబ్బిరెడ్డి

జె.జె.మూవీస్

జంధ్యాల

# నీకూ నాకూ పెళ్ళంట!

జయకృష్ణ

**1776 జులై - ఆ నాలుగు రోజులు**

# స్వాతంత్ర్య పత్రం

స్వాతంత్ర్య పత్రం గురించిన ప్రస్తావన వెనకటి సంచికలో చదివారు. థామస్ పెయిన్ ప్రచురించిన 'కామన్ సెన్స్' అనే కరపత్రం, అమెరికా వలస ప్రజలలో తీవ్రమైన సంచలనంతెచ్చింది. 'డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్' ముసాయిదా ప్రతిని జఫర్సన్ తయారు చేశాడు. దీని విషయమై వాదోప వాదాలు ప్రారంభం కానున్నాయి.... (ఇక చదవండి

## జులై ఒక

తొమ్మిది గంటలవుతోందనే సరికి, సమావేశానికి సంసిద్ధుడవుతున్నాడు జఫర్సన్, తన చందుకా పెట్టెలో వేర్వేరు అరలలో వ్రాత పరికరాలు వుంచుకున్నాడు. ఒక చిన్న సిరాబుడ్డి, కాగితాలు, తీర్మానపు ప్రతి, కమిటీ నివేదికలూ, అనేకం వున్నాయి ఆ పెట్టెలో. బెన్‌రండాల్ అను ఒక శిల్పి యీ పెట్టెను జఫర్సన్ కోసమని ప్రత్యేకముగా తయారు చేసి యిచ్చాడు. పిడితో ఆ పెట్టె చేత పుచ్చుకొని ఈ యువక ప్రతినిధి మేడ దిగి క్రిందికి వచ్చాడు. నౌకరుగానూ, కోచ్‌మాన్‌గానూ పనిచేసే నీగ్రో యువకుడు బాబ్, జఫర్సన్‌కు శుభాభివందనం తెలిపాడు. బాబ్ రోజూ రెండు పర్యాయములు పోస్టుకోసము వెళ్ళి జఫర్సన్ కేమయినా వుత్తరాలలొచ్చాయేమో కనుక్కొని, అవి సమయానికి అందచేసేవాడు. ఈ ఉదయం ఒక వుత్తరాన్ని యజమానికి గర్వముగా అందిచ్చాడు. జఫర్సన్ ఆ లేఖను ఆత్రంగా విప్పిచూసి నిట్టూర్పు విడిచాడు. తను అనుకున్న చోట నుంచి గాక ఒక మిత్రునివద్ద నుంచి వచ్చిందీ లేఖ. భార్యవద్ద నుంచి వుత్తరము వచ్చి రెండు వారాలయింది. సప్తమశ్రేణి, బజారు వీధి దాటి వెళ్తున్నాడు జఫర్సన్. కాంగ్రెస్ అతిథులుగా ఆహ్వానింపబడిన 'ఆరుదేశాల నాయకుల' నివాస మందిరము అతను వెళ్ళే దారిలోనే వుంది.

భవన ప్రాంగణములో నలుమూలల నుంచీ చేరుకొంటున్న తన తోటి ప్రతినిధులు కన్పించారు జఫర్సన్‌కి. కుదిమట్టముగా వుండే బెంజిమిన్ హారిసెన్, పొగాకు వ్యాపారీ మితవాదీ అయిన బ్రాక్స్టన్ (వర్జీనియా ప్రతినిధి)తో ఛలోక్తులాడుతున్నాడు. వారిరువురికీ కొంచెము

ఎడముగా న్యూ ఇంగ్లండు ప్రతినిధులు వున్నారు. జాన్‌యాడమ్స్, శామ్యూల్ యాడమ్స్‌ని ఏదో ముఖ్య విషయము అడిగి తెలుసుకుంటున్నాడు. కాలు నిలకడలేని ఎల్‌బ్రిడ్జి (మెసాచుసెట్స్ ప్రతినిధి), ఎప్పుడూ ఏదో కొంప మునిగిపోతున్నట్లు హడావిడిగా కనబడే షెర్మాన్, (కాన్‌క్టెకట్ ప్రతినిధి) స్టీఫెన్‌హాప్‌కిన్స్ (రోడ్ అయిలాండ్ ప్రతినిధి) - వీరంతా ఒక వైపుగా వున్నారు. దక్షిణ కెరోలినా నుంచి వచ్చిన నలుగురు ప్రతినిధులూ మాంఛి విలువైన దుస్తులు ధరించి వచ్చారు. మిడిల్టన్, వించ్, హేవార్డులు మ నాయకుడైన ఎడ్వర్డ్‌రట్లెజ్‌తో నాలుగవ వీధి నుంచి వస్తున్నారు. వారికి వెనుకను డాక్టర్ ఫ్రాంక్లిన్, అకారము కనబడుతోంది. హాన్‌కాక్ గ్రేడన్ భవనము నుంచి అప్పుడే వచ్చాడు. తెల్లటి బల్లలూ కుర్చీలు గల నలభై అడుగుల చదరమూ, ఇరవై అడుగల ఎత్తు గల ఒక విశాలమందిరములో ఈ ప్రతినిధులు సమావేశమవుతున్నారు. అధ్యక్షుని బల్ల, పెద్ద బల్లకు కొంచెము ఎడంగా వేదిక పైన వున్నది.

జఫర్‌సన్ ఏనాడూ కాంగ్రెస్‌లో మూడు ముక్కలు మాట్లాడి ఎరుగడు. కాని అతను గొప్ప సంభాషణా చతురుడని ప్రతీతి. అతని సారస్వత, వైజ్ఞానిక, రాజకీయాభిరుచుల గురించీ, గణితములోనూ, గానములోనూ, శిల్పములోనూ అతనికి గల ప్రవేశము గురించీ ఈ ప్రతినిధులలో కొందరు విని వున్నారు. వర్జీనియా రాష్ట్రపు ప్రముఖ న్యాయవాదులలో యితనొకడు, పెద్ద భూఖామందు. సహచరులు కొందరు ఈ జఫర్‌సన్‌కి చాలా ప్రమాదకరమగు భావాలున్నాయని అనుకొంటూండేవారు. ఇవి మరీ అభ్యుదయకరముగా వున్నాయనీ తమ కాలానికి సరి పడవనీ అంటూండే వారు. కాని మితభాషి అయిన జఫర్‌సన్‌కి తన అభిప్రాయాలు తన మార్గమూ విస్పష్టంగా తెలుసు. అతను కార్యశూరుడు. అతని చుట్టూ అనేక మాండలికాలు వినబడేవి. కాని అతని సునిశిత శబ్దజాలం ముందు అవి అతి సామాన్యములు.

అధ్యక్షుడు హాన్‌కాక్ నలభై మందికి పైగా గల ప్రతినిధులతో ఈ సమావేశము ప్రారంభించాడు. అందులోని ప్రతి చిన్న ముఠా, తమ స్వరాష్ట్రపు దౌత్య ప్రతినిధుల మనుకునే వారే తప్ప, దేశ ఐక్యతనీ, క్షేమాన్నీ దృష్టిలో పెట్టుకు మాట్లాడే వారు కాదు. ప్రతినిధులలో సగం మంది న్యాయశాస్త్రములో శిక్షణ పొందిన వారు, బ్రిటిష్ రాజ్యాంగాన్ని, మానవ హక్కుల ప్రణాళికను, మన స్ఫూర్తిగా అభినందించే వారు, శిక్షణాయుతమగు న్యాయపాలనపై మానవ భవితవ్యం కలదని నమ్మిన ఈ న్యాయవాదులు, తమది న్యాయ మార్గమనుకున్నారే కాని తాము ద్రోహులమని భావించలేదు. ఆ హాలు మధ్య భాగాన జాన్‌డికెన్సన్, తనకి మద్దతిచ్చేవారితో సిద్ధముగా వున్నాడు.

పెన్సిల్‌వేనియా రాష్ట్రంలోని అతని మిత్రులూ, ఫిలడల్‌ఫియాలోని వర్తక ప్రముఖులైన హంఫ్రీస్, విల్లింగ్‌లూ, రాబర్ట్‌మారిస్ మొదలైన వారూ అతని చుట్టూ చేరారు. ఈ గ్రూపుకు వెనుకగా వున్న జాన్‌యాల్‌సాల్, (న్యూయార్క్), ట్వినెట్‌ని (జార్జియా తమ వైపుకి తిప్పుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"నేను చెప్పుతున్నది అక్షరాలా నిజము. ఇరవయి మంది శాంతి దూతలు ప్రయాణమై వస్తున్నారు వారిప్పుడు మార్గమధ్యంలో వున్నారు. ప్రథమంలో వారు ఆయా రాష్ట్రాలతో సంప్రదింపులు జరుపవచ్చు. కాంగ్రెస్ అధికారాన్ని గుర్తించడానికి కొంచెము జాప్యం చేయవచ్చు. కాని ఈ కాంగ్రెస్‌తో వొప్పందానికి రానిదే తాము యీ దేశంలో చేయగలదేమీ లేదని వారు తొందరలో తెలుసుకుంటారు" అన్నాడు యాస్లాప్.

యాస్లాప్‌కి ఎడమపక్కగా ఇరువురు మితవాద సభ్యులు ఒకరి నమ్మకాన్నొకరు బలపరుచుకుంటున్నారు బ్రాక్స్టన్ (వర్జీనియా) అన్నాడు: "ఈ తొందర బాటెందుకో నాకు అర్థం కావడం లేదు. ప్రజల గౌరవం పొందాలంటే, ప్రజాభిప్రాయం పాటించదలుచుకొంటే, శాంతిదూతలు వచ్చేవరకూ వేచివుండి, వారి సూచనలను పరిశీలించినమీదట ఒక నిర్ణయానికి రావచ్చు. ఈ తొందరబాటు మన స్వాతంత్ర్యోద్యమానికి మేలు చేయదు."

హారిసన్ వారితో చేరి యిలా అన్నాడు: "అవును, ఇంకా సమయము రాలేదు. మొట్టమొదట మనమంతా ఒక సమాఖ్యగా ఏర్పడి, మన ఐక్యతను చాటాలి. ఈ 'గ్రాంట్ కాంటినెంటల్ లీగ్' ఫ్రాన్సుతో ఒక ఒప్పందానికి రావాలి"

'నా అభిప్రాయము కూడా అదే ఇప్పుడు మనము ఆర్భాటంతో స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తే, చివరకది ఒక పర్వతాగ్రము నుంచి దూకడముగా పరిణమించవచ్చు' అన్నాడు రట్లెజ్.

ఈ వర్గానికి కొంచెము ఎడంగా వున్న న్యూ ఇంగ్లండు వాసులు ఇందుకు భిన్నమైన అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. "ఈ శాంతి దూతలవల్ల జరిగే దేమీలేదని, వివేకముగల ప్రతి ఒక్కరికీ తెలుసు' అని అన్నాడు, తొందరగా మాట్లాడకపోతే నత్తి వస్తుందేమోనని భయపడే ఎల్ బ్రిడ్జి గెర్రి.

'ఒకవేళ వారి సూచనలలో కొంచెము మంచి వున్నప్పటికీ వారు మన రాష్ట్రాలను చీలదీసేందుకు ప్రయత్నిస్తారు' అన్నాడు షెర్మాన్.

'ఇప్పటికే కాలాతీతమయినది. వారు మనపై యుద్ధం ప్రకటించేందుకు సంసిద్ధంగా వున్నారు' అన్నాడు డాక్టర్ బార్టెవెట్ (న్యూహాంప్‌షైర్).

శామ్యూల్ యాడమ్స్ అందుకొని శాంతి దూతల గురించి అన్నాడు: "సంధి జరపడం వారి పథకములో లేదు. మీరు లోబడతారా లేక తుపాకీ

కీతో పొరము చెప్పాలా, అని అడుగు తారు.''

''అబ్బే, అదేం లేదు. వారు మనని న్యూనత పరిచేందు కొస్తున్నారు'' అన్నాడు జాన్‌యాడమ్స్ ఒక్కముక్క తో. ప్రభుత్వ భవనంలోని పెద్ద గడియారము తొమ్మిది గంటలు కొట్టి గానే హాన్‌కాక్, స్పీకర్ బల్ల వద్ద కూచుని సభా కార్యక్రమం ప్రారం భించాడు. కార్యదర్శి థామ్సన్ వుత్త రాలూ, నివేదికలూ అందజేశాడు. హెన్రీ లీ తీర్మానముపై చర్చ ప్రారం భించే ముందు దైనందిన సభాకార్య క్రమము కొంత జరుపవలసి వున్నది. ఆ కార్యక్రమానంతరం కాంగ్రెస్ ప్రతి నిధులందరూ ఒక కమిటీగా ఏర్పడి, హారిసన్‌ని అధ్యక్షుని చేస్తారు. అప్పుడు ఈ కమిటీ హెన్రీ లీ తీర్మానాన్ని చర్చించి, వోటింగ్‌కి పెట్టి, ఎందరు సమ్మతిస్తున్నారో ఎందరు వ్యతిరే కిస్తున్నారో తెలుసుకుంటుంది. హాన్‌కాక్ (మసాఛుసెట్స్) భాగ్యవం తుడు, దేశభక్తుడు. నలభై సంవత్సరాల ఈ సాహసోపేతుడు, దృఢకాయుడూ, రూపవంతుడూ మాత్రమేగాక వ్యాపార నిర్వహణలోని తెగింపువంటిదే రాజ కీయ జీవితంలో కూడా చూపేవాడు. తను సాహసిగా తలపోయడం అతని కొకసరదా! బ్రిటిష్ ప్రభుత్వం అతనికి మరింత గర్వ కారణ మయింది. పోయిన సంవత్సరము అతను కొత్తగా తయారవుతున్న విప్లవ సేనలకు తను సర్వ సైన్యాధి పతిగా ఎన్నికవుదామ అనుకున్నాడు. కాని జరగలేదు.

హాన్‌కాక్ తన గొంతుక సవరించు కొని వుపన్యాస షక్కీలో పత్రాలు చదువ నారంభించాడు. ''జనరల్ వాషింగ్టన్...., బెనెడిక్ట్ అర్నాల్డ్,.... ఛార్లెస్ లీ ఈ ముగ్గురు సైన్యాధికారుల నుంచీ ఇంకా సప్లయిలు కావాలని విన్నపాలు.... రాష్ట్ర సభల వద్ద నుంచి రక్షణ కమిటీల ఏర్పాట్ల వివ రాలు.... యుద్ధ పరిస్థితి గురించిన వివరణ.... ఉత్తర దిశనుంచి హడ్సను నదిలోయ గుండా వెనక్కు మళ్ళు తున్న బెనెడిక్ట్ అర్నాల్డ్ సైన్యములో, చాలా భాగము మశూచితో మరణించ డము.... దక్షిణాన ఛార్లెస్టన్ శత్రు శతఘ్నులకు గురికావడము....''

ప్రతినిధులు ఆ యా నివేదికలను శ్రద్ధగా విన్నారు. సప్లయిలు అంద జేయడము విషయమై తర్జన భర్జన జరిపారు. కొత్త తీర్మానాలు ప్రవేశ పెట్టారు.

జోసఫ్ (ఉత్తర కెరోలినా) స్వ రాష్ట్రంలోని జేమ్స్‌అను తన మిత్రునికి వ్రాశాడు. ''సైనిక బలాలు పెంచాలని మేము తీర్మానము చేస్తున్నాం, మందు గుండు సామాను ఉత్పత్తి అధికము కావాలనిమేముతీర్మానం చేస్తున్నాము, ఫిరంగులు తయారు చెయ్యాలని తీర్మా నము చేస్తున్నాము, మందు గుండు సామగ్రి, బట్టలు దిగుమతి చేసుకోవాలని తీర్మానము చేస్తున్నాము. ఈ సేనలూ, ఫిరంగులూ, రక్షణ సామగ్రి, మందు గుండు సామానూ, వస్త్రాలూ - ఇవన్నీ తీర్మాన రూపంలో కాయితాల మీద వుంటున్నాయే తప్ప కార్య రూపం

దాల్చలేక పోవడము కడు హృదయ విదారకము"

సభాకార్య క్రమావళిని ప్రతినిధులు పరిశీలిస్తూండగా, కార్యదర్శి థామ్సన్ వాటిని జర్నల్ లో అధికారయుతంగా రాసుకుంటుండే వాడు. కొన్నాళ్లు అధ్యాపకునిగా పని చేసిన ఈ పండితుడు ఆనాటి రహస్య సమావేశాలూ, ఆ యా ప్రతినిధుల వాద ప్రతివాదాలూ, అభిప్రాయాలూ, ముందు తరాల వారి కోసం జాగ్రత్త పరిచాడు.

స్టిఫెన్ హాప్‌కిన్సు (రోడ్ ఐలాండ్) ఈ రసవిహీనమగు చర్చ భరించలేక తన చేతి బెత్తాన్ని నేలపై మెల్లగా కొట్ట సాగాడు. దేశంలో లేనివీ తయారు చేయవీలుగానివీ, కనుచూపు మేరలో సాధ్యము కానివీ తీర్మానాల వల్ల ఎలా సృష్టింపబడతాయా అని చిరాకు పడే వాడు. హెన్రీ లీ తీర్మానము ఎప్పుడు చర్చకి వస్తుందా అని జాన్‌యాడమ్స్‌తో పాటు ఎదురు చూస్తున్నాడితడు.

హెన్రీ లీ ఆరోజున కాంగ్రెస్ సభకి రాలేదు. అనారోగ్యకారణాన యింటి వద్ద వుండి పోయాడు. జూన్ ఏడవ తేదీన తను ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సభవారికి తిరిగి పరిచయం చేసి దానిపై చర్చ జరిపించవలసిన భారము యాడమ్సు పై బడింది. జూన్ ఏడవ తేదీన తీర్మానాన్ని చర్చకు ప్రవేశ పెట్టినపుడే, కొందరు దీనిలో విప్లవోద్రేకమూ ఆంగ్ల ప్రభుత్వాధికారాన్ని కూలదోసే ప్రయత్నమూ వున్నవని గ్రహించగలిగారు. మితవాదులు తనను విప్లవకారునిగా భావిస్తున్నారని హెన్రీలీకి తెలుసు. వర్జీనియా రాష్ట్ర సభ ఆదేశ ప్రకారము జూన్ 7వ తేదీన హెన్రీ లీ ఇలా చెప్పాడు. "అమెరికాలోని ఈ వలసలు సర్వ స్వతంత్రమగు సంయుక్తరాష్ట్రాలు కాగల హక్కువున్నది. ఈ వలసలు బ్రిటన్‌తో తమకు గల రాజకీయ బాంధవ్యాన్ని పూర్తిగా విడగొట్టుకొని, ఏక లక్ష్యంతో ఇతర దేశాలతో వర్తక సంబంధాలు ఏర్పరచుకొనే స్వాతంత్ర్యము ఈ సంయుక్త రాష్ట్రాలకు వుండాలి"

ఆనాడు హెన్రీ లీ ప్రవేశ పెట్టిన ఈ తీర్మానాన్ని యాడమ్సు బలపరిచాడు. కాని, ప్రతినిధులలో కొందరు ఇందుకు వ్యతిరేకులు. ఆ సాయంత్రము ఏడు గంటల దాకా చర్చ సాగింది. ఆ తరువాత మూడు రోజులపాటు వాగ్యుద్ధం జరిగింది. నాలుగో నాటికి బలాబలాలు సరి సమానమయాయి. జోసఫ్ (ఉత్తర కెరోలినా) వోటుపై ఇటో అటో తెమిలే పరిస్థితి ఏర్పడింది. ఉత్తర కరోలినాకు చెందిన పత్రాలూ, నివేదికలూ వుత్తరాలూ మొదలగునవి అన్నీ కనబరిచి స్వాతంత్ర్య సముపార్జనకు ఆ రాష్ట్ర ప్రజలు ఎంతో సుముఖులుగా వున్నారనే విషయం జోసెఫ్‌కి నచ్చ చెప్పాడు యాడమ్సు.

జోసెఫ్ తనస్థానంలో నిలబడి రెండు చేతులూ పైకి ఎత్తి బిగ్గరగా అన్నాడు: "అయి పోయింది. అయి పోయింది. మీరే నెగ్గారు. మీ నిర్ణయానికి నేను బద్ధుడను." తీర్మానం ఆ నాడు జయం పొందినట్లే కాని మితవాదులు ఈ వోటమిని అంత తొందరగా అంగీకరించ

దలచు కోక, జాన్‌యాడమ్స్ ప్రభావము లో పడ్డ జోసెఫ్‌ని పీల దీయగలమేమో నన్న వుద్దేశంలో పడ్డారు; ఒక చిన్న మెలిక వేశాడు. రట్లెజ్ (దక్షిణ కెరోలినా) ఈ విషయముపై నిర్ణయము జూలై ఒకటో తేదీన తీసుకుందామని వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించాడు. సభ వారు వెంటనే ఆమోదించారు.

జూలై ఒకటో తేదీన వుదయము కార్యక్రమం అయాక, స్పీకర్ హాన్‌కాక్, అధ్యక్షస్థానాన్ని హారిసన్‌కి అప్పగించాడు. ప్రతినిధుల సమావేశము కమిటీగా మారి, హెన్రీ లీ తీర్మానాన్ని పరిశీలించేందుకు కూచుంది. డికెన్సన్ నిటారుగా, హుందాగా నిలబడి, ఒక్కమాట పొల్లు లేకుండా తను చెప్పదలచుకున్నది చెప్పాడు.

"ఒకనాడు మీరు నన్ను ఎంతో సమర్ధునిగా భావించారు. కాని ఈ నాడు నా పలుకుబడి ఒక విధంగా వుంది. ఈ నాటి నా పలుకులు నా పరువు ప్రతిష్టలకీ ప్రజాహిత జీవనానికి గొడ్డలిపెట్టుకావచ్చు. కాని నేటి తీర్మాన పరిణామము మన జాతి భవిష్యత్తును మార్చివేస్తుంది. నామాట లో స్వకార్యచింతన ఎంత మాత్రమూ లేదని గ్రహింపగోరుతున్నాను. నా ప్రజలరక్తాన్నీ క్షేమాన్ని కాపాడేందుకు, నా గౌరవస్థానము వొడ్డుతున్నాననే విషయము సభాసదులు మరువరాదు. ఈ ప్రజల కోసమై నేను ఎంతటి త్యాగము చేయడానికైనా సిద్ధంగా వున్నాను. కాని ఈ స్వాతంత్ర్య తీర్మానము మన దేశాన్ని రక్త పాతంలో ముంచుతుందని నా భయం."

న్యూ ఇంగ్లండు ప్రతినిధులు డికెన్సన్ మాటలు శ్రద్ధగా వింటున్నారు. తను చెబుతున్న మాటలు, ఆయన పూర్తిగా విశ్వసించే చెబుతున్నాడు - అందుకు సందేహం లేదు కాని అతని వాక్ ప్రవాహం అటు ఇటు కాకుండా వున్న కొన్ని వోట్లను తమకి కాకుండా చేయవచ్చు. బయట వాతావరణంలో అమాంతము మార్పు వచ్చింది. వేసవి కాలపు వేడిని తరిమేందుకు చినుకులు పడుతున్నాయి.

ఉపన్యాస ప్రారంభానికి పూర్వము డికెన్సన్ భగవత్ప్రార్ధనలో శిరస్సు వంచాడు. తన జేబులో నుంచి నోట్సు వెలికి తీసి, వాటివంక పరిశీలనగా చూశాడు. మాటకిమాట కడునేర్పుతో వొప్పజెప్పగల ఈ మహావక్త, ఎందుకింత ప్రశాంతంగా ప్రారంభిస్తున్నాడా అని సభా సదులు ఆశ్చర్యపోయారు. తన వాక్పటిమకు మెరుగులు దిద్దుతున్నాడా ఈయనగారు - అనుకున్నారు. ప్రతినిధులు అనుకుంటున్నది నిజంకాదు. అనుభవజ్ఞుడైన వక్త అయినప్పటికీ తన భవిష్యత్తూ, తన జాతి భవిష్యత్తూ, ఈ ఘడియపై ఆధారపడి వున్నవని అతనికి తెలుసు. అందుకని ఎంతో జాగ్రత్తగా, అపశృతి లేకుండా కంఠమెత్తి ఇలా అన్నాడు :

(ఇంకా వుంది

—మాతృక : కార్నెల్ వెన్‌గ్వెల్
—తెలుగు: యవ్వార్ చందూర్




## 1988 జులై 03

'అ ఆ ఇ ఈ క ఖ గ ఘ - అవి ఏమంటాయి ?' అని అతను (రాజేంద్ర ప్రసాద్) ప్రశ్నిస్తే, 'ప్రేమకు పాఠం ప్రేమకు పీఠం ప్రేమే అంటాయి' అని ఆమె (గౌతమి) చెబుతూ, 'జడలో చామంతిదండ మెడలో ముత్యాలదండ చందమామా' అని అన్యాపదేశంగా కవ్విస్తుంది. 'వయసే వరహాల దండ మనసే బంగారు కొండ పైడిగుమ్మా' అని అతను మెచ్చుకుంటాడు. (గాత్రం: బాలు, జానకి ; గేయ రచన : సినారె). విజయలక్ష్మీ మూవీస్ 'తోడల్లుళ్లు' చిత్రంలోని అయిదు పాటల్లో నాలుగు నారాయణ రెడ్డి రాసినవి ; ఒకటి : జొన్నవిత్తుల. రాజ్ - కోటి సంగీతం. .... రాజేంద్రప్రసాద్, గౌతమీతో పాటు చంద్రమోహన్, సత్యనారాయణ, శుభలేఖ సుధాకర్, వినోద్, రాజ్యలక్ష్మి, శ్రీలక్ష్మి, నిర్మల, పిఆర్ వరలక్ష్మి, రజిత ఉన్నారు. కాశీవిశ్వనాథ్ మాటలు, రేలంగి నరసింహారావు దర్శకత్వం. నిర్మాత : జివిజి రాజు. చిత్రంలోని అయిదు పాటలు ఈ ఉదయం 'దేవి - శ్రీదేవి'లో పాత్రికేయులకు చూపించారు.... పిఆర్ఓ నరసింహం.

## .... 08

సవేరా 'పల్లవి' లో శ్రీదేవి నటించిన 'నువ్వే నా శ్రీమతి' లోని పాటల ప్రదర్శన. ఐవి శశి దర్శకత్వం వహించిన ఈ చిత్రం (అయిదారేళ్లనాటిది) మొదట తమిళంలో తర్వాత మాళయాళం, హిందీలలో ఘనవిజయం పొందింది. ఇప్పుడు తెలుగులోకి తెస్తున్నారు కెఆర్ షణ్ముగం. ఇళయరాజా సంగీతం, వసంత కుమార్ మాటలు, రాజశ్రీ పాటలు.... కలవో, కథవో అనిపించే ప్రియ (శ్రీదేవి) తెలిసీ తెలియని వయసులో పొందిన శృంగారానుభవం ఈ చిత్రకథలోని ప్రధాన ఘట్టం - సాముగరిడీలులేని సంచలనాత్మక యితివృతం.... పిఆర్ఓ : అర్జునరావు.

## .... 10

ఇవ్వాళ సినీ టెక్నీషియన్స్ అసోసియేషన్‌వారు ప్లాటినమ్ జుబిలీ సందర్భంగా కలైవణార్‌లో జరుపుతున్న

ఫంక్షన్‌కి అధ్యక్షులు సుప్రీమ్ కోర్టు జడ్జి జస్టిస్ నటరాజన్. రామనాథ్ అవార్డ్ శార్దూల్ సింగ్ సేథి, ఎవియమ్ అవార్డు డైరెక్టరు విశ్వనాథ్, నాగిరెడ్డి అవార్డ్ తోటతరణి, యల్వీ ప్రసాద్ అవార్డ్ చంద్రబోస్, యమ్ జి ఆర్ అవార్డ్ భారతీరాజా స్వీకరింప మన్నారు. అయితే, అదే టైముకి మ్యూజిక్ అకాడమీలో సోవియట్ పప్పెట్ - షో, రాణీ సీతయ్‌లో కళా రంజని ప్రోగ్రామూ ఉన్నాయి - మిత్రులు రావి కొండలరావుతో వారం రోజుల క్రితమే ప్రొఫెసరు పర బ్రహ్మాన్ని చూడటానికి వస్తామని చెప్పాము. అంచేత, మూడున్నరకి 'సిటీ'లోవారు ఏర్పాటు చేసిన ఫిలిమ్ న్యూస్ ఆనందన్ ఎగ్జిబిషన్‌కి వెళ్లాను. ప్రతిసారీ కొత్తగానే ఉంటుంది ఇతను నిర్వహించే ఎగ్జిబిషన్. ఏ ప్రయో జనమూ ఆశించకుండా ఒక సత్కా ర్యానికి అంకితమైన విశుద్ధ జీవనుడు ఫిలిమ్ న్యూస్ ఆనందన్. కొన్ని పనులు వ్యక్తులే చేయగలరు, ఎంత సొమ్ము వెచ్చించినా సంస్థలు చేయలేవనేందుకు మా ఆనందనే ప్రత్యక్ష నిదర్శనం.... 1971లోని 'రిక్షాకారన్' చిత్రానికి బహుమతి అందుకొన్న యమ్ జి ఆర్ బొమ్మ మొదట మిమ్మల్ని పల్క రిస్తుంది. ఆ తర్వాత ఆఫ్రో ఏషియన్ ఫెస్టివల్‌లో (1960) 'వీర పాండ్య కట్టబొమ్మన్'కి బహుమతి అందుకున్న శివాజీ గణేశన్. జాతీయ స్థాయిలో స్వర్ణ పతకం పొందిన తొమ్మిది దాక్షి ణాత్య చిత్రాలలోను నాలుగు మళ యాళం (1966 నాటి 'ఛమ్మీన్' తో ప్రారంభమై), నాలుగు కన్నడ, ఒకటి సంస్కృతం. ఇప్పటికి 3331 చిత్రాలు తీసిన తమిళంగాని, 2954 చిత్రాలు తీసిన తెలుగు గాని ఆ గుర్తిం పుని పొందలేక పోయాయి. (కన్న డంలో వెలువడవి 1169; మళ యాళంలో 1902). సీతా రామా జననం, గొల్ల భామ, విప్రనారాయణ వంటి చిత్రాలలోని స్టిల్స్, మరుపు రాని వ్యక్తుల బొమ్మలు, 1983 సితారా కార్డు, 1987 సినిమా ఎక్స్ ప్రెస్ - డయోనొరా కార్డు, మొట్ట మొదటి ఫిలిమ్ డెయిలీ, చిత్రపరిశ్రమ గురించి దాక్షిణాత్య భాషలలో వెలు వడిన పుస్తకాలు (మాలతీ చందూర్ సెన్సారింగ్ అనుభవాలుతో సహా), అపూర్వమైన ప్రత్యేక సంచికలు, వేర్వేరు జ్ఞాపికలు ఎన్నో ఉన్నాయి. ఈ ఎగ్జిబిషన్‌లో! సుమారు 1600 కోట్ల రూపాయిలు భారతీయ చిత్ర పరిశ్రమలో ఉంది. దేశం మొత్తం మీద 12000 సినిమా థియేటర్లు ఉన్నాయి - ఆంధ్రాలో పర్మనెంటు హాల్స్ 1632, టూరింగ్ టాకీస్ 855; తమిళనాడులో పర్మనెంట్ 1432 - టూరింగ్ 780; కేరళలో పర్మనెంట్ 457 - టూరింగ్ 920; కర్ణాటకలో పర్మనెంట్ 606 - టూరింగ్ 677.... నాలుగు దాక్షి ణాత్య భాషలలోనే గాక హిందీలోను, సిన్‌హాలీస్‌లోను నమక్కాళ్ రామ లింగం పిళ్లె నవలని పిక్చర్‌గా తీశారు — అంతటి గౌరవం ఆయ నొక్కరికే



'నేషనల్ సిటిజన్'గా గుర్తింపూ గౌరవమూ పొందిన టివికె శాస్త్రిని (భారత్ కల్చరల్ కమిటీ ఇంటిగ్రేషన్ కమిటీ - మద్రాసు తెలుగు అకాడమీ). ఉప రాష్ట్రపతి శంకర్ దయాళ్ శర్మ, ఢిల్లీలో జరిగిన నేషనల్ సిటిజన్స్ కమిటీ వారి ఫంక్షన్ సందర్భంగా, అభినస్తుందిన్నారు.



దక్కింది. మొట్ట మొదటి డబ్బింగ్ సినిమా పేరు 'హరిశ్చంద్ర' – 1943 లో కన్నడం నుంచి తమిళంలోకి వచ్చింది. ....వెంకయ్య అవార్డు అందు కున్నవారు యింతవరకు : యల్వి ప్రసాద్, పుల్లయ్య, బిఎ సుబ్బారావు, రహమాన్, కొసరాజు, భానుమతి, బాపు – రమణ .... పద్మ భూషణ్ పొందినవారు : అక్కినేని నాగేశ్వర రావు, శివాజీ గణేశన్, ప్రేమ్ నజీర్, రాజ్ కుమార్.... అలాగే, పద్మ విభూషణ్ పొందినవారు : యమ్మెస్ సుబ్బలక్ష్మి, ఉదయ శంకర్. తులా భారం, స్వయంవరం, నిమజ్జనం – మూడు తడవలు 'ఊర్వశి' అయిన నటీ మణి శారద ఒక్కరే ! 110 వారాలు ఒకే థియేటర్లో (బ్రాడ్వే) ఆడిన చిత్రం 1944నాటి 'హరిదాస్' (త్యాగరాయ భాగవతార్). ఇలాటి విశేషాలు ఎన్నో వున్నాయి ఫిలిమ్ న్యూస్ ఆనందన్ ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్‌లో.... రాణీ సీతయ్ హాలులో కళారంజని వార్షి కోత్సవాల సందర్భంగా, 'ప్రొఫెసరు పరబ్రహ్మం' నాటకానికి ముందు, జేమీ హడ్డాడ్ (Jamey Haddad) వాద్యకచేరీ (డ్రమ్). ఫ్రాంక్ గియొర్గిని (Frank Giorgini) అనే ప్రఖ్యాత డ్రమ్‌మేకరూ, ఈ హడ్డాడ్ కలిసి

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షీస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం
పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీ దొరికితే చదవండి.

'హోడ్గిని' అనే ఒక కొత్తరకం వాద్యం కనిపెట్టారు. ఆఫ్రికన్ - క్లే - డ్రమ్, ఇండియన్ లెదర్ - డ్రమ్ ఈ రెండు నిర్మాణ పద్ధతులూ మిళితం చేసిన 'హోడ్గిని' ప్రాచీన ప్రాకృతిక శబ్దాలను ఆధునిక యాంత్రిక శబ్దాలను పలికించ గలదు ; శ్రుతిలయలను హృదయ స్పందనతో జత పరుస్తుంది. వివిధా నేక శబ్దగతులను సునాయాసంగా చెవులకింపుగా వినిపింపజేస్తుంది. ఇందు లో గల మైక్రోఫోన్, ఎలక్ట్రానిక్స్ చేయగల అద్భుతాలని పరిచయం చేస్తుంది. హడ్డాడ్ వాయించిన ఈ హోడ్గిని శబ్ద సౌందర్యం శ్రవణేంద్రి యాన్ని ఎన్ని విధాలఅలరించేదీ మచ్చుకి చూపింది. ....ప్రొఫెసెరు పరబ్రహ్మం ఇరవై ఏళ్లు కృషి చేసి, వృద్ధులని యౌవ నులుగా చేయగల మందు కనిపెడ తాడు. ప్రయోగానికని నూటపదహార్లు యిచ్చి ఒక ముసలివాణ్ణి పట్టుకొస్తారు. ఆ ముసలివాడు, పునర్ యౌవనం మాట అటుంచి, ప్రయోగం జరిగిన వెంటనే గుటుక్కుమంటాడు (?).... శవాన్ని నదిలో పారేయడం, ప్రొఫె సరుకి, ఆయన భార్యకి, అసిస్టెంటుకి హత్యభియోగభయం, అందుకు తగ్గట్టు గానే కొందరు వీరిని బెదిరించడం, చివరికి మబ్బులు విడిపోవటం - మొత్తం మీద మొదట్నించి చివరి దాకా ప్రతిపాత్రా మనపై నవ్వుల జల్లు కురిపిస్తుంది. రావికొండల్రావు, రాధాకుమారి అనితర సాధ్యమైన హాస్యరసంతో ప్రేక్షకులని మెప్పి స్తారు. వారితో బాటు నాగరాజారావు, విజ్జిబాబు, భాస్కర్, హరి, నారాయణ బాబు, ఈ నాటకానికి తమ పాత్రోచిత పోషణతో నిండుతనమిస్తారు. దర్శ కత్వం : రావి కొండలరావు.

. . . . . 17

"వెంపటి చిన సత్యంగారు కూచి పూడి విద్యకు అంకితమైన ఒక ఆదర్శ గురువు. ఆయన వద్ద శిక్షణ పొందిన ప్రభారమేష్, ఎంత చక్కటి నాట్య కౌశలంతో సదస్యులను మెప్పిస్తు న్నదో మీరు స్వయంగా చూస్తున్నారు. ఆనందిస్తున్నారు" అన్నారు, ముఖ్య అతిథి జి వి రామకృష్ణ (తమిళనాడు గవర్నరుకి యడ్వయిజర్), నారద గాన సభలో కూచిపూడి ఆర్ట్ అకా డమీ ఏర్పరిచిన నాట్యప్రదర్శన సంద ర్భంగా! చినసత్యంగారి వంటి ఆచా ర్యవర్యునికి శిష్యురాలు గావడం తన అదృష్టం అన్నారు ప్రభ. విశిష్ట తతో ఆమె చేసిన ప్రతి ఒక్క అయి టమూ, ప్రేక్షకులను రసానంద లహ రిలో మునకలు వేయించింది. ఈ సందర్భంగా ప్రభా రమేష్ (కోటి సూర్యప్రభ – సినీ ఆర్టిస్ట్ ప్రభ', కూచి పూడి ఆర్ట్ అకాడమీ బిల్డింగ్ ఫండ్కి డెబ్బయి అయిదు వేలు విరాళంగా ఇచ్చారు. లోగడ మంజుభార్గవి తన నాట్యప్రదర్శనల ద్వారా లక్ష రూపా యిలు సేకరించి బిల్డింగ్ ఫండ్కి సమ ర్పించారట. గ్రీన్ వేస్ రోడ్లో, గవర్న మెంటు మ్యూజిక్ కాలేజీకి ఎదురుగా, కూచిపూడి ఆర్ట్ అకాడమీ వారి స్వంత భవనం కొద్ది నెలల్లో పూర్తికా



"Father, Kaikeyi loved Rama more than Kaushalya and brought him up showering so much of affection and care. How could such a nice charming lady be so stupid as to be carried away by the words of a low-bred servant-maid?"

"It is a plausible question, Raghu, but you should know that woman was not real Mandhara."

"Oh, the usual twist. You mean to say that some goddess descended from heavens to take the form of Mandhara?"

"Exactly. Not some goddess - Goddess Saraswati herself who controls all thoughts and actions of mortals. If Rama were to be crowned and if he were to live happily thereafter, the very purpose of the avatar would be defeated - the purpose being killing of Ravana. So, all the minor gods whom we call Devatas approached Goddess Saraswati and begged of her to do this favour for them. Obligingly she did taking the form of Mandhara. With Rama's banishment for fourteen years Dasaratha's death and Bharata staying away at Nandigram, the curtain falls on Ayodhya-"







మన్నది. అది నుంచి కళలకు ఆశ్రయ మిస్తున్నది మద్రాసు మహానగరమే - అని చెప్పారు వెంపటి చినసత్యం.

....18

'కలెక్టర్‌విజయ' శత దినోత్సవ వేడుకలు వుడ్‌లాండ్స్‌లో! ముఖ్య అతిథి దాసరి నారాయణరావు; అధ్య క్షులు: యమ్మెస్ రెడ్డి....ఆ మధ్యా హ్నం 'జమీన్ రైతు'లో చదివిన 'జలగం వెంగళ్రావు - శ్రీనివాసులు రెడ్డి' విషయం కాఫీలప్పుడు కృష్ణకు చెప్పాను - ఆయన నవ్వుకున్నారు..... 'వాట్ నెక్స్‌ట్'? అని అడిగినప్పుడు 'ఒకే షెడ్యూల్‌లో ముప్ఫయి రోజు లలో హైదరాబాదులో పూర్తి చేదా మనుకుంటున్నాను. కథ నేనే తయారు చేసుకున్నాను' - అన్నారు విజయ నిర్మల .........విజయవాడ - విజయ కృష్ణ, గుంటూరు - జ్యోతిమహల్, రాజమండ్రి - మేనక, కాకినాడ - లక్ష్మీటాకీస్, ఏలూరు - రమామహల్, విశాఖపట్నం - పూర్ణా, శ్రీకాకుళం- అంజనేయా, హైదరాబాదు - శ్రీని వాసా అండ్ బాలాజీ, సికింద్రాబాద్- రాజేశ్వర్, నిజామాబాద్ - రాజ రాజే శ్వర్, అనంతపూర్ - రామచంద్రా, తిరుపతి - మినీప్రతాప్.... మొత్తం పన్నెండు పట్నాలలో పద మూడు థియేటర్లలో శతదినోత్సవం చేసు కుంది 'కలెక్టర్‌విజయ' చిత్రం .... (అయిదారు సంవత్సరాల తర్వాత- 'అంతం కాదది - ఆరంభం' పిక్చర్ తర్వాత, విజయనిర్మలని వెండితెర మీద చూస్తారు ప్రేక్షకులు. ఎంతో గంభీరమూ ఉదాత్తమూ అయిన పాత్ర ఆమెది ఈ పిక్చర్లో! స్క్రీన్‌ప్లే రస భూయిష్టంగా ఉంది....'జ గ తి' - 383)........ ఒక పుస్తకావిష్కరణ సభకు (రాజీవ్ గాంధీతో ప్రెస్ పార్టీతో వెళ్లినప్పటి విశేషాలు) రాజ రాజేశ్వరీ కళ్యాణ మండపం పూర్తిగా నిండి పోయిందంటే, మీరు నమ్మ లేరు. జి.కె మూపనార్, కేంద్ర మంత్రి అరుణాచలం, వైస్ ఛాన్సలర్ జ్ఞానం, జస్టిస్ మోహన్, ఎవియమ్ శర వణన్, మాటినీ ఇడల్ కమల్‌హాసన్ యిలా పేర్లు చెప్పి వారి ప్రసంగాలు వినడానికి వచ్చారని కొందరు అన వచ్చు. కాని శివశంకరికి తమిళ సార స్వతంలోను, సామాజిక రంగంలోను గల స్థానం అద

కి రాగానే 'మాలతి ఎక్కడ?' అని ఆప్యాయంగా అడిగి, మాలతి కనిపించ గానే ఎంతో సంతోషంగా రిసీవ్ చేసుకు, అభిమానంతో పల్కరించిన శివశంకరి, సాహితీతృష్ణ గల స్నేహ పాత్రురాలు.... శివశంకరి రచనలలో సాహిత్యం కంటె జర్నలిజమ్ ఎక్కువ ఉంటుంది - అని ఆమె విషయంలో కొందరు విమర్శకులు అంటారు. ఉంటే వుండుగాక, ఎర్‌స్కిన్ కాల్డ్ వెల్‌లో లేదా, జాన్ స్టెయిన్ బెక్‌లో లేదా. జాన్ గంథర్‌లో లేదా? శివ శంకరి ప్రఖ్యాత రచయిత్రి - సామా జిక శ్రేయంపై దృష్టి నిలిపే సంచల నాత్మక రచయిత్రి. ఇందిరాగాంధీని షడేళ్ల వ్యవధిలో రెండుసార్లు ఇంటర్వ్యూ

చేశారామె; రాజీవ్‌గాంధీ ప్రెస్ పార్టీతో రెండుసార్లు వెళ్లారు. ఇంగ్లీషు లో రాసే వారికే తప్ప, దేశ భాష లలో రాసేవారికి గుర్తింపు లభించని కాలంలో, ఒక మణియన్, ఒక శివ శంకరి సాధించిన విజయాలు ప్రశంస నీయమైనవి. జస్టిస్ మోహన్, ఎవి యమ్ శరవణన్ వంటివారు శివశం కరి రచనా శైలినీ, విషయ ప్రాశ స్త్యాన్నీ మెచ్చుకున్నారంటే, తమిళ సారస్వతంలో ఆమె స్థానం ఎటు వంటిదో తెలుసుకోవచ్చు. (శివశంకరి 'ఒరు మనిదన్', కథ ఇందిరాగాంధితో ఇంటర్‌వ్యూ తెలుగు పాఠకులకి లోగడ పరిచయం చేశారు మాలతీ చందూర్)

.... 20

"ముప్ఫయి నాలుగేళ్ల క్రితం నేను విజయనగరంలో పని చేశాను. ఆంధ్రా లో విజయనగరం మొదటి నుంచీ లలిత కళలకు పుట్టినిల్లు – ముఖ్యంగా సంగీత సాహిత్యాలకు ఆ ఊరి వారైన రమణయ్య రాజా, కళా రంజని అధ్య క్షులుగా, కళా సరస్వతిని సేవించడం సర్వసహజం.... గత పదిహేనేళ్లగా మద్రాసు నగరంలోని తెలుగు వారు సంగీత నాట్యాలను అనేక విధాల ప్రోత్సహిస్తున్నారు – తెలుగువారి కళా కేంద్ర మయింది ఈ పట్నం.... ప్రఖ్యా త సంగీత విద్వాంసుడైన జేసుదాసు పాట కచ్చేరి వినాలనే ఆత్రంతో ఉన్నా రు మీరందరూ," అని చెప్పారు తమిళ నాడు గవర్నరు సలహాదారు జి వి రామకృష్ణ, నారద గాన సభలో, కళా రంజని 30వ వార్షికోత్సవ ముగింపు సమావేశానికి ముఖ్య అతిధిగా విచ్చేసిన సందర్భంగా! రమణయ్య రాజా కృత జ్ఞతలు తెలిపారు; కార్యదర్శి పాండు

రంగ వందన సమర్పణ గావించారు.... కొచ్చిన్ నుంచి వచ్చే ఫ్లయిట్ మూడు గంటలు ఆలస్యమవటంవల్ల, ఏర్‌పోర్ట్ నుంచి తిన్నగా నారద గానసభకు వచ్చిన జేసుదాసు, వెంటనే సంగీత కచ్చేరి ప్రారంభించారు. ఆ కంఠంలోని గాంభీర్యం, మాధుర్యం, వాతాపి గణపితిం నుంచి ముదుగన్ దాకా ప్రతిపాట లోనూ గల సంగీత సాహిత్యాలకు, శ్రావ్యత గాన సుధ తోడు కాగా, క్రిక్కిరిసిన హాలులోని ప్రతి ఒక్కరూ తన్మయులై విన్నారు. జేసుదాసు పాట వినడం, మనసుని గాన సంచారిగా చేసే ఒక రసానుభూతి.

.... 24

'సలామ్, బాంబె' చిత్రం 1988 మే నెల 11–23 తేదీల మధ్య జరిగిన కాసిస్ ఫెస్టివల్‌లో బహు ప్రశంసలు పొందింది. గౌతమ్ ఘోష్ 'యన్ యఫ్ డి సి' సహకారంతో నిర్మించిన 'అంతర్జలి యాత్ర' 'గ్రాండ్ ప్రిక్స్' పొందగా, ఈ 'సలామ్ బాంబె' ని సినీ విమర్శకులు, రసజ్ఞులైన ప్రేక్షకులు ఘనంగా మెచ్చుకున్నారు. ఇవ్వాళ ఉదయం పద కొండున్నరకి 'యన్ యఫ్ డి సి' కాన్ఫరెన్స్ హాలులో దర్శక నిర్మాత, మీరా నాయర్ పత్రికల వారిని కలుసుకున్నారు. వచ్చినది మొత్తం పన్నెండు పధ్నాలుగురు. కుముదం, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ యిలాటివి గాక, తెలుగులో 'జగతి' ఒక్కటే. ఈ చిత్ర నిర్మాణ సంబంధమైన సాధక బాధకాలు



పునర్నిర్మాణం కోసం శ్రీలంక కోరిన 60 బిలియన్ డాలర్ల ఆర్థిక సహాయ అభ్యర్థన పరిశీలించే నిమిత్తం, ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్(IMF)తరఫున వచ్చిన అయిదుగురు ప్రతి నిధులలో, అందరిలోకీ చిన్నదీ (27 ఏళ్ళ) ప్రతినిధి వర్గంలోని ఏకైకవనిత అయిన కల్పన ('జగతి' 386 - 'డైరీ' జూన్ 26, 1988)

*******************

మీరా నాయన్ ఎంతో చక్కగా వివరించారు. ఈమె చిన్నతనం ఒరిస్సాలోను, ఆ తర్వాత ఢిల్లీలోను గడిచింది. ప్రస్తుతం న్యూయార్క్‌లో ఉంటున్నారు. చిత్రం 'షూట్' చేసినది బొంబయి వీధులలో ; మ్యూజిక్ సమకూర్చినది హాలీవుడ్‌లో. ఈ చిత్రానికి కెమెరా నిర్వహణ ఒక లేడీ ; 130 మంది బాల బాలికల జీవిత వివరాల కోసం (బొంబాయి పేవ్‌మెంట్స్‌మీద

అనాథల్లా బతికేవారు) ఏడువారాల పాటు ఒక వర్క్‌షాపు జరిపి, ఆ పరిశీలనల నుంచి ఒక కథ రూపొందించిన వ్యక్తి ఒక లేడీ (మీరానాయర్ సిస్టర్ - సైకాలజీ చదువుకున్న సంఘ సేవా పరాయణి). వారి యూనిట్‌లో అధికభాగం స్త్రీలే! ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందీ భాషలలో తీసిన ఈ చిత్రం, ఫ్రాన్సులో రిలీజవుతోంది; ఇటాలియన్ డబ్బింగ్‌తో ఇటలీలో రిలీజవుతోంది; యూరోపియన్ దేశాలలో రిలీజవుతోంది; అమెరికాలో రిలీజవుతోంది. కాని, హిందీ వెర్షన్ మాత్రం ఇండియాలో ఎప్పుడు రిలీజవుతుందో యింకా తెలీదు.... వర్క్‌షాపుకి పిలిపించిన 130 మంది పిల్లలలోను, తమ చిత్రానికిగాను పదిహేడుగురిని సెలక్టు చేశారు. ఆ పదిహేడుగురిలో ఏయిదుగురుకి చిత్రంలో ముఖ్య పాత్రలు వున్నాయి. వీధులలో నిరాశ్రయంగా వుండే ఈ పిల్లలు, 'సర్వయివల్' కోసం (కేవలం బతికేందుకు) ఏ మార్గాలు, ఏఏ పరిస్థితులలో అవలంబిస్తున్నదీ, ఆ పిల్లలలో వుండే కట్టడులూ, నీతి నియమాలూ, ఎదుట వారి కష్టాలకు స్పందించడం - వీటిని దర్శక నిర్మాత మీరానాయర్ ఎంతో దయనీయంగా, మానవతాగీతంలా రూపొందించారని ఫ్రెంచి పత్రికలూ ఇంగ్లీషు పత్రికలూ ప్రశంసలు కురిపించాయి. 'రిలీజ్ మాట అటుంచి, మాకెప్పుడు చూపిస్తారు?' అని పత్రికల వారు అడగ్గా, 'అక్టోబరులో' అన్నారు మీరానాయర్. మీరాబాయి ఫిలిమ్స్, యన్‌యఫ్ డిసి, దూరదర్శన్, ఫిలిమ్ ఫోర్ ఇంటర్నేషనల్, కాడ్రేజ్-యస్ఎ, లా - సెప్ట్ - యిందరు కలిసి సంయుక్తంగా నిర్మించిన ఈ చిత్రానికి ఎనభై లక్షలు అయింది. "మూడు నెలలపాటు బొంబయి వీధుల్లో, గ్రాంట్ రోడ్డూ, రయిల్వేస్టేషనూ ప్రధానంగా ఈ చిత్రం షూట్ చేశాము. వీధుల్లో అవడం వల్ల రెండు మూడు వేల క్రవుడ్ ఎప్పుడూ ఉండేది. టీ స్టాల్స్ వద్ద, కామాటిపురలోను షూట్ చేస్తున్నప్పుడు మేమెంతో నేర్పుగా వ్యవహరించవలసి వచ్చేది. మొత్తం 52 లొకేషన్స్‌తో, రెండు సంవత్సరాలు పట్టింది. కెమెరా వుమన్ 'మదర్ థెరిసా' డాక్యుమెంటరీ తీసినావిడ - ఇది ఆమె మొదటి ఫీచర్ ఫిలిమ్. సందేశాలు చెప్పడం నా ఉద్దేశ్యం కాదు - వాస్తవిక పరిస్థితులకి రూప చిత్రణ యిది. నేను ఎక్కడ వున్నప్పటికీ, ఏఏ దేశాలు తిరుగుతున్నప్పటికీ ప్రప్రథమంగా ఇండియన్‌ని" - అన్నారు మీరా నాయర్.... పి ఆర్ ఒ టియమ్ రామన్.

—యన్నార్ చందూర్



జీవిత మంతా ఈ దారిద్ర్యంలోనూ పుస్తకాలు వ్రాయడంలోనూ గడిపే బదులు మీక్కూడా కొంచెం మూలధనం వుంటే ఎంత బావుండేది — అన్నదట కారల్ మార్క్స్ భార్య, భర్తతో.

— హెరాల్డ్ మాక్మిలన్



ప్రజా స్వామ్యం,
సామ్యవాదం, మత నిరపేక్షత,
ఐక్యత, సమైక్యతలు
శాంతి, పురోగతులకు మన
పటిష్టమైన పునాదులు.



davp 88/245 Tel

సమీక్షలు

# చిత్రజగతి

## రమేష్ వారి 'డాన్స్ రాజా డాన్స్'

కన్నడంలో అఖండ విజయం పొందాక, ఈ చిత్రం (దర్శకనిర్మాత ద్వారకేష్) తెలుగులోకి వచ్చింది. తెలుగులోకూడా విజయం పొందాక, రమేష్ ఇంటర్నేషనల్ ద్వారా జివిఎస్ మణి యిప్పుడు తమిళంలోకి తలిదండ్రులు పాప్యులర్ మ్యూజిక్‌లో ప్రఖ్యాతులు. ఆరేడేళ్ల పసివాడు కూడావారితోబాటు పాడుతూ వుంటాడు. ఒక రోజున ఆ స్టార్ హోటల్ ప్రొప్రయిటర్ తల్లిని బలాత్కరించ బోయి, తండ్రిని కత్తితో పొడిచి, ఆ హత్యానేరం తల్లిపై మోపగా, ఆమెకు పన్నెండేళ్ల జైలు శిక్ష పడుతుంది – ఈ పసివాడు పాటలు పాడుతూ పొట్ట పోసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. తల్లి, జైలు నుంచి వెలుపలికి వచ్చే సరికి, యితను ఒక 'డాన్సింగ్ సింగర్' అయిపోతాడు. ఆ హోటల్ ప్రొప్రయిటర్ కూతురే యితనిని ప్రేమిస్తుంది. ప్రతీకార వాంఛతో కుత కుతలాడుతున్న కథానాయకుడు, కాళ్లు లేని అంకుల్ సహాయంతో, పగ తీర్చుకుంటాడు. 'అవాస్త వికత' అధికంగా వున్నప్పటికీ నూతన బాణీలోని నృత్య సంగీతాలు ప్రేక్షకులని మెప్పిస్తాయి.... లీలావతి ఒక నాటి ప్రముఖ తార ('మరోమలుపు') -ఆమె కుమారుడు వినోద రాజా యిందులో హీరో ('జగతి' - 379.... 1987 నవంబరు 22 'డైరీ').... తమిళ చిత్రానికి పిఆర్ఓ: టియమ్ రామన్.

## భాను ఆర్ట్ 'స్వర్ణ కమలం'

మన సంస్కృతినీ, మన సాహిత్య సంగీత నృత్య వైభవాలనీ నేటి ప్రేక్షకులకు చేరువుగా తేవాలనే తపన కళాతపస్విగా మన్ననలందుకుంటున్న విశ్వనాథ్‌లో శంకరాభరణం, సాగరసంగమాల నుంచి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ 'స్వర్ణ కమలం'లో ప్రతిదీ బంగారు తళుకు లీనే కమనీయ సన్నివేశమే తప్ప, నకిలీది ఒక్కటి కూడా కనిపించదు. మన కళలలోని ఔన్నత్యం ఏ అమెరికనో వచ్చి చెబితే గాని గ్రహింపనేరని దుస్థితిలో వున్నామనే విషయం, ఒడిస్సీ నర్తకి ద్వారా మృదువైన చురక తగినలించినట్లుగా చెప్పించారు

దర్శకులు విశ్వనాథ్. కళా స్వరూపా లన్నీ పరమ శివుని పాదాల వద్ద వుంచ వలసిన స్వర్ణ కమలాలని నమ్మిన ఒక అంధ నాట్యాచార్యుడు, పెద్దమ్మాయికి సంగీతం, చిన్నమ్మాయి మీనాక్షికి (భానుప్రియ) నాట్యం నేర్పుతాడు. సాంప్రదాయిక కట్టుబాట్లలో వుక్కిరి బిక్కిరయే మీనాక్షి. అల్లరి చిల్లర అబ దాలతో, చిన్న తెర పెద్దతెర చూపించే పసిడి కలల పల్లకిలో విహరిస్తూండగా, సినిమా హెూర్డింగ్స్ రాసే యువకుడు చంద్రం (వెంకటేష్), చిలకలపూడి బంగారానికీ అసలు బంగారానికీ గల తేడా ఆమె తెలుసు కొనేటట్టు చేస్తాడు. వెంకటేష్ ఈ చిత్రంలో చూపిన నటనా కౌశలం ఎంతో ప్రశంసనీయం. సమర్పణ : కె యస్ రామారావు: నిర్మాత : సి హెచ్ అప్పారావు.

## విజయలక్ష్మి వారి

రేలంగి నరసింహారావు దర్శకత్వం లోని చిత్ర మంటే రెండున్నర గంటల సేపు హాయిగా నవ్వుకోవచ్చు. ఆయన చెప్పదలుచు కున్నది కామెడీ ద్వారా వ్యక్తం చేయిస్తారు. మిథ్యా గౌరవాల తో నిష్కారణంగా నలిగిపోయే మధ్య తరగతి కుటుంబాల దయనీయ చరిత్ర సాధారణంగా కనిపిస్తూ వుంటుంది. బస్ కండక్టర్ ఉద్యోగం చేసుకుంటూ మా మ్మతో (నిర్మల) ఉంటున్న భాస్కరం (రాజేంద్ర ప్రసాద్), తనకంటూ ఒక యిల్లు కట్టు కోవాలనే ఆశయం గల వాడు ; ఇల్లు తర్వాత యిల్లాలి విష యం.... ఆ అద్దె ఇంటో మూడు కాప రాలు వున్నాయి. ఒకటి: ఇన్‌స్టాల్ మెంట్సు మీద కలర్‌టివి, ఫ్రిజ్ యిత్యా దులు కొనే భార్యా, నలుగురు పిల్లలూ గల ప్రభుత్వోద్యోగి (వేలు); రెండు: చెటు కింద ప్లైపు రైటరుతో ఇద్దరు పెళ్లికాని ఆడపిల్లలూ ఇల్లరికపు పెద ల్లుడు (చంద్రమోహన్) తో సంసారం ఈదు కొస్తున్న నరసింహం (సత్య నారాయణ); మూడు: భాస్కరం అతని మామ్మ.... పెళ్లిచూపులు, వరకట్న సమస్య, ఎదురింట్లోని 'యల్ ఐ సి' సుధాకర్, నరిసింహం రెండో అమ్మా యిని ప్రేమించడం, మూడో అమ్మాయి అరుణ (గౌతమి), బస్ కండక్టరా అని చులకనగా మాట్లాడి తర్వాత అతని లోని ఔదార్యం తెలుసుకోవడం - ఈ చిత్రంలోని కథాంశాలు అతి స్వల్ప కాలంలో అగ్రశ్రేణికి చేరుకుంటున్న గౌతమి పెర్‌ఫారమెన్స్ బావుంది. నిర్మాత: జివిజి రాజు.

## రాశీ మూవీస్
## 'భార్యా భర్తలు'

రామకృష్ణ (శోభన్‌బాబు) రామ శబ్దానికే అంకితమై, 'ఒక మాట, ఒక బాణము, ఒక పత్నీవ్రతుని' గా ఉం డాలను కొని, ఎదురు ఫ్లాట్‌లోని శాం తిని (రాధ), తనకి ఉద్యోగం వచ్చాక పెళ్లి చేసుకుంటాడు. పైకి కీచులాడు కుంటూ, అంతర్యంలో పరస్పరం ప్రే మించుకున్న ఈ యిద్దరూ స్థిరపడి, ఒక ఫ్లాట్‌లో వారయాక, తన ఉద్యో గం నిలుపుకునేందుకు, కంపెనీ వారి

కోసం రాబట్టవలసిన కాంట్రాక్టు విషయంలో, కఠినంగా కనిపించే ఆఫీసు మేనేజరు ఆశాలత (సుహాసిని) మనసు కరిగించేందుకు ఒక జాలి గాథ (తనపై ఆధారపడ్డ ముసలి తల్లి దండ్రులు, పెళ్లి గావలసిన ఇద్దరు చెల్లెళ్లు, ఒక పోలియో తమ్ముడు - ఈ కుటుంబ భారం కాంట్రాక్టు సేకరించ లేకపోతే వెంటనే తన ఉద్యోగం పోవడం, తామంతా వీధిలో పడటం) సినిమా రీలులా వర్ణించి చెప్పే సరికి 'అయ్యో పాపం' అని ఆమె కాంట్రాక్టు మంజూరు చేస్తుంది. రామకృష్ణకి ఒక మారుతీ, ఒక బంగాళా యిస్తుంది కంపెనీ : లైఫ్ స్టయిల్ మారిపోతుంది. తన అక్క గారికి మల్లే ఆశాలత కూడా మోసపోయి, తన సర్వస్వం రామకృష్ణకు అర్పిస్తుంది. ఆ తర్వాత హీరో చూపే పత్నీవ్రతం కొంచెం కృతకంగా ఉన్నప్పటికీ, సుహాసిని చూపిన కుసుమ కోమల కాంతా హృదయం, నాటకీయతకు రక్తిమనిస్తుంది. అంకుల్ (రంగనాథ్) శంకర్ తమ అకవుంట్ పరిష్కరించు కోవడంతో, తనుకన్న బిడ్డ జీవితాలంబనగా ఆశాలత నిష్క్రమించడంలో చిత్రం ముగుస్తుంది. దర్శకులు : మురళీమోహన రావు. నిర్మాత యమ్ నరసింహారావు.

## ప్రవంతీ వారి 'చల్ చల్ గుఱ్ఱం'

పెద్దోడు, చిన్నోడు, బయట వూరు నుంచి వచ్చిన అమ్మాయి, అబ్బాయి - అందరూ పదేళ్ల లోపువారు. వయసు లోకి చిన్న, తనమాట కాదంటేనూ తనని నిర్లక్ష్యం చేస్తేనూ కెవ్వున కేక పెట్టి, పంతం నెగ్గించుకొనే చిన్నోడు బొమ్మలు గీయడంలో దిట్ట - అంతే కాదు, పుట్టెడు బుద్ధులు. పక్కనున్న మనూ అంకుల్ వారికి ప్రేమా స్పదుడు. బయటవూరునుంచి వచ్చిన అమ్మాయీ అబ్బాయీ ఈ మనూ అంకుల్ సిస్టర్ పిల్లలు, నలుగురు పిల్లలూ మూడు సైకిళ్లమీద (చిన్నోడు యింకా స్వంతంగా రెండు చక్రాల సైకిలు తొక్కలేడు) ఒకసారి మ్యూజి యమ్ చూడటానికి వెళ్లినప్పుడు, చిన్నోడికి మాజిక్ అంకుల్ తటస్థ పడతాడు. వెండి (తెల్ల) గుర్రంబొమ్మ రే డి యే ట ర్ కాప్పైవున్న జీప్‌ని చిన్నోడు అక్కడే చూస్తాడు. మ్యూజి యమ్ నుంచి మార్తాండ వర్మ కిరీటం, మార్తాండవర్మ ఖడ్గం దొంగలు ఎత్తుకు పోతారు. మనూ అంకుల్ ఫాదర్ (డియస్‌పి) ఆ దొంగలని పట్టుకోబోయి చనిపోతాడు మంటలలో! బోర్స్టల్ స్కూలునుంచి తప్పించు కొచ్చిన ఒక బాలుడు, ఈ నలుగురు పిల్లలకీ దగ్గిరవుతాడు - కారు ఎలా మంటల పాలయినదీ కళ్లారా చూసినదీ ఆ కుర్రాడొక్కడే! ఈ అయిదుగురూ దొంగల ముఠా రహస్యం ఛేదించడం

## నెహ్రూవాణి

రాజకీయాలలో గాని యుద్ధ భూమిలోగాని తెంపరి తనంతో చేసే ప్రయోగాలు '(యడ్వంచరిస్ట్ టాక్ టిక్స్') విజయ వంతమవడం చాలా అరుదు. అపాయాలతో కూడిన కొంత సాహసం తప్పదు - కాని తెంపరి తనం చిన్నతనపు చేష్ట.

1950 నవంబరు 20

---

ఈ బాలల చిత్రంలోని యితి వృత్తం. ఎంటర్‌టైన్ మెంటుతో బాటు బాల హృదయాలు ఎటువంటి పసిడి హృద యాలో తెలిపే ఈ చిత్రానికి నిర్మాత: రవి కిషోర్. మాతృక: మళయాళం.

---

తక్కువ వాగ్దానాలు చేసి వ్యక్తికే మీరు వోటు వేయండి. ఎందు వల్ల నంటే అతను మిమ్మల్ని నిరుత్సాహ పరచలేడు. —బెర్నార్డ్ బరూచ్

ఇదిగో, భౌతిక అవశేషా అడుగున గల ఆ పై గోరీపై ఏమున్నదో చూ డండి: ఆత్మ గర్వం లేని అందం, దర్పంలేని ధైర్యం, క్రౌర్యం లేని సాహసం, మనిషిలోని సుగుణాలన్నీ ఏ ఒక్క దుర్గుణమూ లేకుండా! ఇదే ఏ నరుని సమాధి పైనున్నా, అది మెచ్చు కోవడం గాక పొగుడుతున్నారనిపిస్తుం ది. కాని, 'బో ట్స్‌వయిన్' స్మృతిగౌరవ చిహ్నంగా ఆ మాటలు ఎవరూ కాదన లేరు (పెంపుడుకుక్క) —మార్క్‌ట్వేన్

సీరియల్

# మంజిలి

## అన్నపూర్ణా రెడ్డి

డాక్టరు సారథి పల్లెటూళ్లో ఉంటున్నాడు. చెల్లెలు గాయత్రి, పిల్లలతో, అన్నగారిని చూడటానికి వచ్చింది. ఈ వాతావరణం ఆమెకు సుతరామూ నచ్చలేదు. అందుకు తోడు సారథి పిల్లలు ఇంట్లో ఉన్న కొత్త మనిషిని 'పిన్నీ, పిన్నీ' ఎంతో ప్రేమగా పిలుస్తున్నారు. ఎవరీ పిన్నీ ? ఈ జానకి యిక్కడ ఎందుకుంటోంది .... ఇక చదవండి

"పిన్ని" అన్నారు పిల్లలు.

'జానకి' - బదులిచ్చాడు సారథి.

అంతకు మించి విషయాలు రాబట్టలేకపోయింది గాయత్రి.

'పిన్ని' అనేసరికి అనుమానంగా చూచింది గాయత్రి. జడను ముడిగా చుట్టి సాదావాయిల్ చీరతో చిన్న మెత్తు బంగారమైన ఒంటి మీద లేకుండా, చేతులకు వెలసి పోయిన మట్టి గాజులు, నుదుట కుంకుమ, బోసి మెడతో అతి నిరాడంబరంగా వున్నా కించిత్ ఆకర్షణీయంగానే వున్న జానకి ఎవరా అన్న విషయమే కొరుకుడు పడక అశాంతిగా లోలోపలే వేగిపోయింది గాయత్రి.

ఆ పూటంతా అలసటతో తల్లీపిల్లలు పడి నిద్రపోయారు.

మరే విశేషము లేకుండా రెండు రోజులిట్టె గడిచిపోయాయి.

ఉదయం లేవగానే డాబుగా దర్జాగా ముస్తాబవడం.... ఇంట్లో ప్రొద్దు పోవడం లేదంటూ విసుక్కోవడంఅడుగడుగునా తన ఇంటి దర్జా దర్పాలు వెల్లడయ్యే ధోరణిలో మాటలు విసురుతూ పిల్లలను ఆంక్షలు విధిస్తూ తిరిగేది గాయత్రి.

అతిథి మర్యాదల్లో వీసమెత్తు అయినా లోటు పాట్లు జరగకుండా అతి జాగరూకతతో ఒదిగి మసిలేది జానకి.

'జానకీ .... జానకీ' అంటూ సారథి 'పిన్నీ, పిన్నీ' అంటూ పిల్లలు, వారి అన్యోన్యం చూస్తూంటే ఊహలు ఎటో పరుగులెత్తేవి గాయత్రిలో.

### 5

గాయత్రి పిల్లలు, రవి విజ్జి కలిసి వసారాలో ఆడుకొనేవారు.

తన పెద్ద టాయ్ గన్ భుజానికి తగిలించుకొని పేంటులో షర్ట్ టక్ చేసుకొని స్టయిలిష్‌గా నడుస్తూ "ఎవడైనా అడ్డొస్తే కాల్చేస్తా" అంటూ సర్రున తుపాకీలాగి గురి పెట్టేవాడు శీను.

చెట్టు క్రింద మట్టిలో ఆడుకొనే పిల్లల్ని చూస్తే గాయత్రి కేకలేసేది.

తన పిల్లలను దగ్గరకు పిలిచి "చూడు చిట్టీ! మట్టిలో ఆడకూడదు. బట్టలు పాడైపోతాయి, గజ్జి వస్తుంది. తప్పమ్మా" అని అనునయంగా చెప్పేది.

అన్నగారి పిల్లల్ని మాత్రం "సరి పోయారు. మట్టిలో మీ లాగ ఏవి తిరుగుతాయో తెలుసా? అదో" అంటూ దూరాన కంచెల్లో తిరిగే పందుల్ని చూపేది.

శీను, చైతన్య చప్పట్లు చరిచి మరీ నవ్వే వాళ్లు.

ఉక్రోషం ముంచు కొచ్చిన రవి "మట్టిలో ఆడినంత మాత్రాన పిగ్స్ అవుతారేంటి. పిల్లలు మరీ అంత గిరి గీసు క్కూర్చోకూడదట. రోగాలు రాకుండా రేసిస్టెన్స్ రావాలంటే దుమ్మూధూళి కొస్త అంటాలట" అనే వాడు.

"ఓ యబ్బో! డాక్టరువు నీవే అయి నట్లున్నావే!" గాయత్రి వెక్కిరింపుగా అనేది.

"మానాన్న డాక్టరు .... ఆయన అలాగే చెప్పారు! మాకు ...." విజ్జి రోషంగా కల్పించుకొనేది.

పిల్లల్ని దీర్ఘంగా చూస్తూ "మంచి చెప్పి నేనెందుకు చెడ్డ అవ్వాలి. మీ పెంపకం అలాటిది .... మీ తప్పే ముందిలే .... అందరికీ బాధ్యత ఎలా వస్తుంది?" అంటూ కంటి కొసలతో ఇంట్లోకి చూస్తూ అన్నమీద కసంతా జానకి మీద వెళ్ళగక్కేది గాయత్రి.

ఆ కాస్సేపు వసారాలో కూర్చున్నా, తిరిగే పిల్లలంతా ఆటల్లో పడి చెట్టు క్రింద చేరేవాళ్లు.

నారాయణ వాళ్ళ చేతుల్లోవున్న బొమ్మలను చూస్తూ "ఒక్క సారి నన్ను పట్టుకోనీవూ ఆ గన్" అంటూ ప్రాధేయ పడేవాడు.

"ఎయ్ .... నీవు దొంగ .... ఛో" అని కసిరేవాడు శీను.

"వాడు దొంగ కాదు, మా ఫ్రెండ్ ....ఇంకో సారి అలా అన్నావంటే చూడు" – చూపుడు వ్రేలితో బెదిరించిది విజ్జి.

విజ్జి అంటే ఏ మూలో ఇష్టమున్న శీను "అయితే నా జట్టు వుంటావా ...." అంటూ అడిగేవాడు శీను.

మొత్తానికి నారాయణ దూర దూరంగా నిలబడి, వాళ్లు ఆడుకొనే ఆటల్లో మానసికంగా తనూ పాల్గొంటూ చేతిలోని చింతపిక్కల్తో ఆడుకొని తృప్తిపడేవాడు.

విజ్జి, రవీలు వాడిని తమ జట్టులో కలుపు కొనేవారు.

ఏదో చుట్టం చూపుగా కాకుండా అన్న ఇంటి పరిస్థితి పునిశితంగా గమ నిస్తూ మనసులోనే అంచనా వేసుకో సాగింది గాయిత్రి.

ముఖ్యంగా జానకి ఎవరు అన్న సందేహం పట్టుకొని మనసుకు శరీ రానికీ విశ్రాంతి కరువైంది. కొన్ని యుగాలుగా ఆ ఇంట మసలు తున్న వ్యక్తిలాగ జానకి తిరగడము పిల్లలూ సారధి, ఎట్టి అరమరిక లేకుండా ఆ అమ్మాయికే ప్రాధాన్యం ఇస్తూ రాసుకు

పూసుకు తిరగడం చూస్తూ ఊరుకో లేక పోయింది. పైగా ఒక్క ఉత్త రములో నైనా మాటవరసకు కూడా, అన్నగారు తనకు తెలియ చేయక పోవడం గాయత్రి స్వాభిమానం మీద బాగా పనిచేసింది. అంటే.... అన్నయ్య కు.... నే నే ప రా యి దా న న్న మాట.... అన్నయినా, భర్తయినా ఇంకొకరైనా ఎదురుగా వున్నంత వరకే మెరమెచ్చికోలు, మాటలు, అభిమానాలు ఏమయినా మగబుద్ధి పోనిచ్చుకోరీ మగవాళ్లు. ఆలోచించే కొద్దీ నిలదీసి అడిగేస్తేగానీ మనసుకు స్తిమితం చిక్కని స్థితికి దిగ జారింది గాయత్రి.

రాత్రి భోజనాలు చేశాక పిల్లలు వెన్నెల్లో కబుర్లు చెప్పుకుంటూ మధ్య మధ్య "రింగ్ అరౌండ్ ది రోజస్" పాట పాడుతూ ఆడుకో సాగారు. నారాయణకు కూడా అందులో ప్రవేశం లభించడంతో మరీ ఖుషీగా ఆటలో పాల్గొన్నాడు.

వీధిలో చాలా వరకు పిల్లల గోలలే. 'వెన్నెల కుప్పలు', 'పెళ్ళి వారి రాయభారాలు', 'గొబ్బి', 'కొండ మీదకోడి' ఈలా రక రకాలాటలు

జట్లు జట్లుగా ఆడుకుంటున్నారు. ఆ వీధిలో పిల్లలు ఈ వీధిలోకి, ఈ వీధిలో పిల్లలు ఆ వీధిలోకి పోతూ సందడి సందడిగా కేకలేసుకుంటూ తిరుగుతున్నారు.

జానకి ఫోంచేసి, పక్కలు దులిపి వంట ఇంటిలో పని సర్దుకో సాగింది.

సారథి పేపరు పుచ్చుకొని గుమ్మాని కెదురుగా, హాల్లో కుర్చీలో కూర్చున్నాడు. తనూ ఓ కుర్చీ లాక్కొని తెలుగు పత్రికలు రెండు ముందేసుక్కూర్చుంది గాయత్రి. పేజీలయితే తిరుగు తున్నాయి కాని ధ్యాసక్కడ లేదు. సారథి నెలాగయినా కదపాలని దృఢ సంకల్పంతో కూర్చుంది.

"అన్నయ్యా"

"ఏమ్మా!" పేపర్లోంచి తలపైకెత్తి తిరిగి వాల్చేశాడు సారథి.

"జానకి ఎవరన్నయ్యా?"

"జానకి .... అంటే ఓ మన జానకి నేనా నీ వడుగుతూంట?"

అది మతిమరుపో లేక కావలసి అలా చేస్తున్నాడో తెలుసుకోలేక చిర్రెత్తుకొచ్చింది గాయత్రికి. అయినా తమాయించుకొని "అవును" అంది.

"జానకి.... సాటిమనిషి. పైపెచ్చు .... మన ఇంటిలో వుంది.... మన బాగోగులు చూస్తుంది .... అంతే!"

గుర్రుగా చూస్తూ.... "కాని అందరూ అలా అనుకోరుకదా?"

"అందరితోటీ నాకేం పని, చెల్లెమ్మా"

"అవును, అంత ధీమా వుంది కాబట్టే, అంత ధైర్యంగా ఇంట తెచ్చి పెట్టు కున్నావు .... అంత అక్కర వదిన మీద వుండి వుంటే .... సంసారమిలా చెక్కలు ముక్కలయ్యేదా? ...." గొంతు పెంచి నిలదీసింది.

అరచేత్తో గడ్డం రుద్దుకొని "మీ వదిన సంగతి వదిలేయి గాయత్రీ ... ఆమెకు నచ్చిన విషయాన్ని చేసే తత్వం ఆమెది. అందుకే తనకు నచ్చిన దగ్గర, తనకు నచ్చిన రీతిలో వుండిపోయింది. ఆ విషయాన్ని గురించి తర్జన భర్జని లెందుకు?" తేలికగా కొట్టి పారేశాడు.

"అవును, మరి అవిడకు నచ్చిన రీతిలో ఆవిడ వుండి పోతే .... ఇక్కడ నీకు నచ్చిన రీతినే వుండిపోయావు.... మధ్యలో .... తలెత్తుకోలేక బాధ పడేది నేనేగా .... తల్లికి పుట్టింది ఇద్దరమే అయినందుకు ఒకరి నొకరు తోడుంటారని, పుట్టి నింటి అచ్చట ముచ్చట తీరుతుందని, ఈలా తోడబుట్టిన ప్రేమలు చంపుకోలేక సిగ్గు విడిచి, నేను రావాల్సిందే కదా .... నీకేమొ చీమ కుట్టి నట్టయినా లేదు"....

పేపర్లోంచి తలపైకెత్తలేదు సారథి.

అసలు తను చెప్పిన మాట చెవికెక్కిందా లేదా? .... ఊరికే కంఠశోషేనా అన్నంత చిర్రెత్తు కొచ్చింది గాయత్రికి. చాలా సేపటికి తలపైకెత్తి, "గాయత్రీ.... ఇది నీ పుట్టినిల్లే నమ్మా .... ఇక్కడ నీకు అగౌరవము జరగడం కానీ, నీవు కించపడే అవసరం కానీ రాదు. యథేచ్ఛగా రావచ్చు. పోవచ్చు" తూచి తూచి బదులిచ్చాడు సారథి.

"అంతేగానీ నీ దారి నీవు మార్చుకోవన్న మాట .... అసలా అమ్మాయి ఏ అధికారంతో ఈ ఇంట వుంది?.... ఈ ఇంటితో గల సంబంధ బాంధవ్యాలెటు వంటివి ?"

చెల్లి ముఖంలోకి చూచి చిన్నగా నవ్వి, ఎడం చేత్తో తల తడుముకొంటూ "అంత దూరం నేనాలోచించలేదు, చెల్లీ....జానకి ప్రాపకంలో పిల్లలు నిశ్చింతగా పెరుగుతున్నారు. నాకున్న చింతల్లా పిల్లల గురించే....కానీ జానకి సంరక్షణలో నా గురించి కానీ పిల్లల గురించి కానీ ఎట్టి ఆలోచనా లేదు. ఇప్పటికిలా జరిగి పోతోంది. జరగనియ్యి. ఏదేదో ఊహించుకొని, నీవు హైరానా పడ్డం ఎందుకు చెప్పు?"

"అంతే కానీ జానకికి ఈ ఇంటితో గల బాంధవ్యం చెప్పవన్నమాట."

"చెప్పానుగా అమ్మా ! సాటి మనిషి అని, అంతే. జానకి సంగతి వదిలేయ్. బావ క్రొత్తగా వ్యాపారం ఏదో మొదలు పెట్టబోతున్నట్టు ఆ మధ్య వ్రాశాడు. మీరున్న ప్రాంతంలో పట్టు ఎక్కువగా పండు తుందట కదా?"

భర్త విషయం వచ్చేసరికి ఎక్కడ లేని ఉత్సాహం పుట్టుకొచ్చింది.

"అవునన్నయ్యా, చుట్టు పట్ల పట్టుకాయకొని ఉడికించి పట్టుదారం తీసే పరిశ్రమ - వీలుబట్టి పట్టు మగ్గాలు కొన్ని నెలకొల్పాలని ఆయన ఆలోచన అయినా అనుకున్నవి అనుకున్నట్టు కావు కదా,"

## PIOUS MAN

Late Chalikonda Appa Rao who retired as a Central Intelligence Officer passed away peacefully in Kakinada at the residence of Dr. Bhavani Prasad, his fourth son. Late Appa Rao Garu has four sons and four daughters - the last daughter Man . being one of the unfortu e victims of the Kanishka Air Crash ma Krishna, the eldest. Durga Prasad, the third—both of them are in the States. The second son Rammohan is with the Computer India Ltd , New Delhi. Eldest daughter Seethalakshmi is connected with the activities of Sri Vankateswara Temple at Pittusburgh. The second daughter Mohana Kumari is married to Sri N Seshadri, Asst Commissioner of Income Tax at Madras. The third daughter Nagamani is married to Sri Kondal Rao (Mrs. A. C. Krishna Rao's Sister's son). Late Appa Rao Garu was a recipient of the Indian Police Medal. and the Fire Services' Medal He was a pious man of charitable disposition with abunbant kindness and generosity. May his soul rest in peace 'the peace that passeth all understanding'

"నీవు.... మీ ఆయన తలచుకోవాలే కానీ పనులు కావు అన్న ప్రశ్నే లేదు, చెల్లీ....ఆ పట్టుదల మీ ఇద్దరిలోనూ జీర్ణించి వుంది"

అన్నగారి ప్రశంసకుమనస్ఫూర్తిగా నవ్వేసింది గాయత్రి.

"అన్నయ్యా,....నాకిక్కడ ఏమీ తోచడం లేదు....ఇంటి పట్టున ఎంత పని వున్నా మహిళామండలి, వాటి కార్యక్రమాల్లో పాల్గొనేదాన్ని. ఇక్కడ ఊరికే కూర్చోవాలంటే"....

"ఓ.... దానికేం.... రేపే గ్రామ సేవికను రమ్మంటాను. ముఖ్య సేవిక ఊళ్ళో లేదు - సెలవులో వెళ్ళినట్టుంది.... గ్రామ సేవిక ద్వారా ఇక్కడి మహిళా మండలి సభ్యులను కలుసుకొని, వారు నిర్వహిస్తున్న కార్య క్రమాలు చూచి వీలుంటే సలహాలివ్వు.... నీ దగ్గర నుండీ ఇక్కడ మహిళలు నేర్చుకోవాల్సిన దెంతయినా వుంది,"

ఆ మాటతో గాయత్రికి ఏనుగెక్కినంత సంబరమైంది. "తప్పకుండా అలాగే కానీ అన్నయ్యా" - అంది ఊహా లోకాల్లో విహరిస్తూ.

## 6

మరుదినం ఉదయం పదకొండు పన్నెండు మధ్య.... తలుపు మీద సన్నగా చప్పుడైతే "ఎవరూ" అంటూ తడి చేయి కొంగుకు తుడుచు కొంటూ ముందు గదిలోకి వచ్చింది జానకి.

ప్రింటెడ్ గ్రీన్ కాలిసింథ్ చీరా మేచింగ్ బ్లౌజు ధరించిన పాతిక సంవత్సరాల యువతి గుమ్మంలో నుంచొని వుంది. సామాన్యమైన ఒడ్డూ పొడుగూ. చామన చాయలో, పెద్ద ఆకర్షణీయంగా లేక పోయినా వస్త్ర ధారణ అలంకరణ వల్ల మరోసారి చూడాలన్పించే ట్టుగా వుంది.

రెండు చేతులు జోడించి "నమస్కారం - నాపేరు సౌదామిని. ఇక్కడ గ్రామ సేవికగా వుంటున్నాను.... డాక్టరు గారు మిమ్మల్ని కలుసుకోమన్నారు" అంది ఆ అమ్మాయి....

ప్రతి నమస్కారం చేసి "లోపలికి రండి" అని ఆహ్వానించి ఓ కుర్చీ చూపించి "కూర్చోండి. మీరు కలుసుకోవాలను కొంటున్న వారిని పంపిస్తాను" అంది జానకి.

లోపల గదిలో పడుకొని ఏదో పత్రిక తిరగ వేస్తున్న గాయత్రి "ఎవరూ" అంటూ ఇవతలికి వచ్చింది.

"సౌదామిని ఇక్కడ గ్రామ సేవిక, డాక్టరు పంపించారట."

"వీరు డాక్టరుగారి చెల్లెలు గాయత్రీ దేవి గారు" పరస్పరం పరిచయం చేసింది జానకి.

సౌదామిని లేచి చేతులు జోడించింది.

"ఏమిటీ, మీ ముఖ్య సేవిక రాలేదా ఇంకా"? కాస్త దర్పంగా ప్రశ్నించింది గాయత్రి ఓ కుర్చీలో కూర్చుంటూ.

"లేదండీ.... బహుశా రేపు ఎల్లుండిలో ఈ వూరు రావచ్చు" వినయంగా బదులిచ్చింది సౌదామిని.

"ఇక్కడ.... మీ ఆధ్వర్యంలో ఏవో మహిళా మండలి కార్య క్రమాలు ముమ్మరంగా సాగుతున్నాయని అన్నయ్య చెప్పారు చూద్దామని"

(ఇంకా వుంది

